# భారతాభ్యుదయము

(శబరబాల)

B V. K

రచయిత

సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ

కోట సుబ్రహ్మణ్యశాస్త్రి, P.O.L.,

ఆంధ్రభాషాధ్యాపకుఁడు,

వేంకటగిరిరాజ కళాశాల,

నెల్లూరు





1957

మూల్యము రు. 1–8–(

# కృతిసమర్పణము

~~~/o/~~~

ఉ. బాల కులీన సాధ్వి రస
భావసమన్వితఁ గోమలాంగి ధీ
శాలిని సద్గుణాంచితఁ బ్ర
సన్నను మామక కావ్యకన్య ని
ల్లాలిఁగ నీకొసంగితి, స
మాదర మొప్ప సుధాబ్ధిపుత్రితో
నేలికొనంగదయ్య కృత
కృత్యుఁడ నయ్యెద వేంకటేశ్వరా!
~~~

# తొలిపలుకు

D. V. K

క. భరతావని చిరకాలము
పరరాజుల యేలుబడికిఁ బాల్పడి యెటులో
పరతంత్రతఁ దొలఁగియుఁ
బరిపూర్ణతఁ గోలుపోవఁ బ్రజ లతిభీతిన్.

ఆ. కాందిశీకు లగుచుఁ గాంతారసీమల
నాత్మరక్ష లేక యటమటించు
గాథ చెవిని సోఁకఁ గఱఁగిన నా డెంద
మిట్టి కృతికిఁ బ్రోత్సహించె నన్ను.

తే. కాందిశీకసతీమణి కన్న బిడ్డ
బోయదొరసాని పెంచిన పుణ్యరాశి
భరతమాతకుఁ బరిపూర్ణభాగ్యదాత్రి
సరససద్గుణశీల యీ శబరబాల.

క. అల "శశి"లో ముందు బ్రకటిత
ములైన యీ నాదు పద్యములఁ గని విద్యా
ర్థులు ముద్రణమున కగు ధన
మెలమిన్ దా మొసఁగి ప్రోత్సహించిరి నన్నున్. 4

క. మద్యత్నము లేకయె మ
ద్విద్యార్థుల యాదరమున వెలయించితి నీ
పద్యకృతి; వారి కాయు
ర్విద్యాసంపదలు వాణికృప వర్ధిలుతన్!

శా. దర్భా వేంకటకృష్ణమూర్తి విలస
ద్భాషాత్రయీపాండితీ
గర్భోదారసుధానిధానకవితా
గంగార్ఝరీధుర్యుఁ డం
తర్భాతాదరుఁడై పదింబదిగఁ బ్రో
త్సాహించి శోధింప నా
విర్భావంబుఁ గనెన్ మదీయకృతి; త
ద్విజ్ఞున్ బ్రశంసించెదన్. 6

క. భారద్వాజసగోత్రుఁడ,
సూరివిధేయుండ, కోట సుబ్రహ్మణ్యో
దారాఖ్యుఁడన్, ద్విభాషా
సారస్వతసేవకుండ, సజ్జనసఖుఁడన్. 7

క. జని పృథులాసీమన్, బా
వనగౌతమితటిని దేవభాషాభ్యసనం,
బునికియు సింహపురిన్, జీ
వనం బుపాధ్యాయవృత్తి, పఱిగున్ నాఁ 8

క. కృతకృత్యతఁ బొరయుట్కై
యతిభక్తిన్ నీకిదే సమర్పించితి నీ
కృతి, దీవింపవె కరుణా
న్వితమతి బుధసమ్మతముగ వేంకటనాథా! 9

# FOREWARD



With great pleasure I presided over a public meeting held on 9-2-1957 in the V. R College Hall, for publishing "SABARABALA" or "BHARATABHYUDAYAM"-recently written and printed by Sri Kota Subrahmanya Sastri, one of the Telugu Lecturers in V. R. College, Nellore. The Proceedings were opened by my friend Sri I. Srikrishnayya, in a well-informed speech in which he brought out the various moot points in the book. I briefly narrated the outlines of the story to the audience. A number of learned people who had developed their creative faculty as poets and their critical faculty as pandits spoke on the occasion reading verses from the various contexts and situations in the book.

Mr. D. V. Krishnamurthy, M.A., Head of the Department of Telugu, V. R. College, Nellore, very appropriately proposed that the title of "PROUDHA KAVI" should be conferred on the author of the piece. This he conveyed in a verse, which he handed over to me. The verse was read out to the audience and with their approval the title was conferred upon the author, who thereafter could be legitimately called "PROUDHA KAVI - KOTA SUBRAHMANYA SASTRI". He richly deserved the title. The merits of the book amply justified it. The story is a simple one and there are not any complicated situations in it, but the composition was artistic. The reader's interest was sustained throughout. The verses were free, easy and flowing. They were not burdened with heavy SAMASAMULU and involved construction, simple in pharaseology, direct in conveying the idea and clear in expression, the verses read well and were easy to the ear. There were several verses, which described the natural scenery in various moods and aspects. These descriptions also are attractive and appropriate to the context. The poet was fond of ARDHANTHARANYASAMU and there are several verses in which he indulges in it.

Readers of the book will face a question as to why the author gave the book the name of "BHARATHABHYU-DAYAMU" and how the name is justified by the story. A consideration of the main points in the story will afford an answer to this question. The story opens with a journey in a mountain range, of a group of people, carrying goods of great value and an attack upon them by a gang of robbers, who succeed in exterminating the travellers and capturing their wealth. A woman with a suckling child was one of the party of travellers and to escape from the robbers, she steps out of the path of robbers but is bitten by a snake and dies. The little child—a girl—knows not the distinction between life and death and is still on the suckling breast. Along with the booty, she is taken to their Lord and master and presented to him. His wife being childless brings her up and she grows to maidenhood. The robber lord wants to offer human sacrifice to his Goddess—Kali. His servants catch hold of a young man who is performing *Tapas* in the neighbouring forest and radiates "SANTI and AHIMSA". He is taken into the temple of Kali and when the robber Lord tried to raise his sword to cut off the neck, it slips from his hand—he is over-powered by the presence and *Satwic* influence of the young *tapaswe*. The girl—the Lord's foster daughter, naturally falls in love with him and finds her way to his *ashram* and without disturbing his *Tapas*. At that juncture, the *Tapaswi's* Guru comes on a visit, takes in the situation and brings about a marriage between the two. Incidentally the robbers are cured of their cruel ways, the cult of the sword and sword is given up and the cult of *ahimsa* or *KRUPA* is adopted by them all.

This story brings out a transformation of a mountain race from the uncivilised ways of cruelty and human sacrifice to the highly civilised ways of AHIMSA and peaceful living. In this lies, BHARATABHYUDAYAM. It looked as if the author suggested, and rightly, in these days, when the development of tribal people is engaging the attention of Government and is felt indispensable, before India can fully and wholly claim to be civilised and cultured, that it is the duty of the civilised part of India to get into touch

with mountain tribes, by living in their midst or otherwise, change their primitive tendencies and make different men of them. It will be noticed that in the story, the girl, the boy whom she marries and the Guru, do not belong to the tribe improved or transformed. This suggests the idea of the necessity for outside influences and outside agency. Only this reading of the book will justify the alternative name given to it — namely *Bharathabhyudayamu*.

The author deserves to be congratulated upon the work that he has produced. He has been rightly honoured with the title of "PROUDHA KAVI" and I hope that in the future, we will have from his pen many more works equally attractive and pleasing.

T. V. SIVARAMAIAH.

# REVIEW

~~~/0/~~~

"Bharatabhyudayamu" ('Sabara baia )

By

'*Proudha Kavi*' Sri Kota Subrahmanya Sastry, *P.O.L.*

This poem relates the story of two refugee children, one male and the other female, orphaned in the Vindhya forests. The girl is adopted and brought up by a childless tribal chief and his consort, while the boy grows up under the care of a learned, saintly Brahmin. The youth soon becomes proficient in all the arts and sastras, and is sent by his Guru and guardian to do 'Tapasya' (penance) for the good of 'Bharat' (India). The girl now grown into a beauteous maiden happens to see the handsome youth meditating in a pool near the Narmada river. She falls in love with him at first sight. A little later, the young ascetic also sees her and is charmed by her grace and beauty. But he restrains his feelings and remains unperturbed. Afterwards, he is seized by the tribesmen and taken to the Kali temple to be sacrificed. His saintly personality, quiet demeanour and gracious speech effect a marvelous change in the tribal chief who now abjures all violence, prostrates to the young saint and turns into a Mouni. Afterwards the girl pining with love seeks out the Asrama of the young hermit and renders him devout service for long. So she gradually wins his heart. At last the Guru himself comes in search of his young ward, and seeing the young couple amidst austerities, he is much pleased. Soon he meets there the foster-parents of the girl, and with the blessings of both sides the holy pair are married.

This work is the first fruit of the author's poetic genius and in many respects it is a ripe fruit. It possesses three distinguishing merits. First the love-romance is depicted in a very refined and chaste manner without a
~~~

trace of coarseness anywhere. Secondly the 'Tapasya' which is the central feature of Indian culture is made the chief, formative force of the sublime characters of the hero and the heroine, as in the Indian classics like "Kumara Sambhavam". Thirdly the versification, the style, the generalisations and the descriptions are excellent. By its literary graces as well as by its noble theme, this poem will certainly rank among the modern classics.

I hope the author will adorn the Muse with still brighter ornaments. My best wishes go with him in his future literary enterprises.

V.R. College,
Nellore,
12—3—57.

**G. V. Subbaramayya, M.A. (Hons.),**
*Head of the Department of English.*

'మందాకిని' (వారపత్రిక) నెల్లూరు

# భారతాభ్యుదయము

## (శబరబాల)

### గ్రంథసమీక్ష

కర్త:—విద్యాప్రవీణ కోట సుబ్రహ్మణ్యశాస్త్రులవారు
నెల్లూరు రాజాగారి కళాశాల ఆంధ్రాధ్యాపకులు

క్రౌన్ 8–92 పారటలు వెల రు. 1–8–0

ఇది చిన్నదయ్యు రసవత్తరకావ్యము. శాస్త్రులవారు అన్నిటా ఆర్ష సంప్రదాయసంపూజనలౌల్యులగుటచే కులీనయైన కావ్యకన్యకను సృష్టించినారు. ఇంకొక విశేషము. క్రొత్తపాతలలో వీరి ఒనగూర్చిన భావ భాషాభూషణములు శయ్యాకుసుమములు ఈ కావ్యమునకు వింత కైసేతలై మురిపెమును గూర్చుచున్నవి.

ధారతెంపులేక చదరముగా పారు అమృతపూరము. కవనధోరణిలోని గాంభీర్యము ఆధునికఫక్కిలోని నవ్యచారుత దేశీయములందలి చిక్కదనపు తీపి ఈ కవిత్వము నలంకరించిన అక్షీరుచివాసనల తీరు.

"అది వింధ్యాటవి" అని ప్రారంభించి తెనిసక్ధోరణి చూపిరి. వీరి యభిమానకవుల ఆంధ్రసంస్కృత ఆంగ్లధోరణులు ఔచిత్యపూర్ణముగ అతికించబడియున్నవి.

తిక్కన భావమును బాహ్యచేష్టలను ముడిబెట్టి చెప్పుటలో దిట్ట గదా! అట్టి హృద్యసన్నివేశము లెన్నియో ఇందు గలవు. శ్రీనాథుని మధురగంభీర యానమును ఈ కవిత, అప్పుదెచ్చుకొని సొంతమే చేసుకొన్నది.

శ్రీ మల్లాది శివన్నారాయణ

నవరసభావాలంకృతములు నుడులు. నవ్యమధువులు "భాసుర హాసముతో శకుంతికావల్లకి మీాటె రాగరసవాహిని దిక్తటినిండ" బోటివి చాల ఉన్నవి.

కతలో అల్లికగాని బిగువుగాని ఇక కొంత యుండినచో ఎంతో బాగుండెడిది. భారతాభ్యుదయ మన్న పేరుకు ఆస్కారమే లేదేమొ!

ఇంతెందుకు? కావ్యము ఆమూలాగ్రము నమిలి మ్రింగి ఊమియను పిప్పిలేదు. నెమరు వేచ్చుకొనుచుండవలసిన చెరకుగడ.

భావసంకర భాషాసంకర దినాలలో శాస్త్రులవారు ఇట్టి నిద్దుష్ట కావ్యమును సృజించుట ఆంధ్రభారతికి మంచిదినాలు ఇంకను కల వన్న ఊరటను కలిగించుచున్నది.

శ్రీరస్తు

# బిరుద ప్రదానము

స్వస్తి శ్రీ దుర్ముఖి సం॥ మాఘ శుద్ధ దశమి స్థిర వాసరమున (1957-2-9) "భారతాభ్యుదయ" కృతి ప్రకాశ సందర్భమున సమావేశమైన మహాసభలో దర్భా వేంకట కృష్ణమూర్తి ప్రతిపాదనముపై సభాసదుల యామోదముతోఁ గృతికర్త సాహిత్యవిద్యాప్రవీణ ఉభయభాషాప్రవీణ బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి "ప్రౌఢకవి" బిరుద మొసంగఁబడినది.

క. ప్రౌఢఁగఁ దీరిచి యిట్లు న
వోఢను నీ కావ్యకన్య నో సుబ్రహ్మ
ణ్యా! ఢక్కను మొరయించితి!
"ప్రౌఢకవి" ప్రాజ్యబిరుదపాత్రుఁడ వోయీ!

టి. వి. శివరామయ్య,
అధ్యక్షులు.
9-2-1957

దర్భా వేంకటకృష్ణమూర్తి
ప్రతిపాదకుఁడు.
9-2-1957

శ్రీ శారదాంబాయై నమః

# భారతాభ్యుదయము

## (శబరబాల)

ఉ. శ్రీల నొసంగు మా కెపుడు
చిన్మయ తేజము వ్యాధభూమికా
లోలము సూర్యచంద్రశుచి
లోచనఫాలము భక్తపాలనా
శీలము హస్తిచర్మమృదు
చేలము స్త్రీపురుషస్వరూపస
మ్మేలము నిత్యనూతన మ
మేయ ముమాశితికంఠలీలముల్. 1

B.V.K

శా. రారా రాఘవ! జానకీసహితు నిన్
రాజ్యాసనాసీనుఁ గ
న్నారం గాంచి సుఖింతు నంచు జనకుం
డన్నన్, వనీవాటికిన్
బోరా! యన్నను, నిర్వికారమతి స
మ్మోదప్రసన్నాత్ముఁ డే
వీరుం డా రఘువంశచంద్రుఁడు కృపన్
వీక్షించి మ మ్మేలుతన్. 2

ఉ. భారతభూప్రజాహృదయ
పంకజముల్ వికసింప, నార్ష సం
స్కారవిశేష సౌరభము
సర్వదిగంతములందుఁ బర్వ, నా
ధారము నీవె కావున సు
ధారసధారల నామజిహ్వా సం
చార మొనర్పుమా జనని!
శారదనీరదమూర్తి భారతీ!

మ. కొనఁ డాహారము ఛాత్రులం దొకనికిన్
గోరంత నో వ్వంటినన్
దన శిష్యుల్ నిగమాగమాయతకళా
తత్త్వార్థపారీణులున్
వినయాలంకృతు లెన్నఁ డౌదు రని యు
వ్విళ్లూరు వేమాఱు మా
హనుమచ్ఛాస్త్రిని శబ్దశాస్త్రనిధి వి
ద్యాదేశికుం గొల్చెదన్.

శ్రీ మల్లాది శివన్నారాయణ

# వింధ్యాటవి

~~~~:o:~~~~

మ. అది వింధ్యాటవి, సాంధ్యరాగ మపుడే
యంతర్హితం బయ్యె, శ్వా
పదగర్జాధ్వని మాఱుమ్రోసె గుహలన్,
బాంథౌఘ మొక్కండు దు
ష్పథముం బట్టుట సాఁదెచీఁకటికి ది
గ్భ్రాంతిన్ గిరాతవ్రజా
స్పదమౌ కోనకుఁ జేరవచ్చె గమన
శ్రాంతాతిదీనాకృతిన్. 5

ఉ. దారిఁ గనంగరాక, తల
దాఁచికొనం దగు తావు లేక, వి
స్తారపథిశ్రమన్ మగిడి
సాగఁ దలంచియుఁ గాళ్లు రాక, దు
ర్వారవిపత్పయోధిఁ బడి
పాంథసమూహము తల్లడిల్లి యే
తీరున నాపదం గడవఁ
దీరు నటంచుఁ దలంచునంతలోన్ 6

సీ. కొండనెత్తాలపైఁ గొఱవిదయ్యములట్లు
కరదీపికల వెల్గు గానవచ్చె
వినవచ్చె నంతంత వెన్నాడు మానిసుల్
మంతనం బాడిన వింతసద్దు
~~~~

నిన్నులఁ దలఁదన్ను మేదినీధ్రమునుండి
పిండుపిండుగ దూఁకె గండశిలలు
దిక్కులఁ గబళించు ప్రక్కప్రమాఁకులు దూసి
తెం పేది పైఁబడె నంపగములు

ఆ. పథికసార్థ మద్రిమథితసాగరమట్లు
సుడివడంగ శబరచోరభటులు
పొడువుఁ డెందు సురిఁగిపోనీకుఁ డని యార్చి
బాటసారిమూఁకపయిని బడిరి. 7

ఉ. ఏకడఁ జూచినన్ బుడమి
యీనినమాడ్కిఁ బుళిందతస్కరా
నీకము నిల్వఁ డుండుఁ డను
నిస్వనముల్ దివి ముట్టఁ బాంథులన్
దాఁకఁగ, నంధకారమునఁ
దల్లులు బిడ్డల వీడి నల్దెసల్
ప్రాఁకిరి యార్తనాదములు
బ్రద్దలు సేయ నభోంతరాళమున్. 8

ఉ. బీరము లాడుచున్ గవిసి
పేటికలన్ విదళించి మేలిబం
గారపుసొమ్ములన్ గొనియుఁ
గాంతలఁ బట్టి బలాత్కరింప నీ

ఘోరము మానుఁ డంచుఁ దమ
కర౯ బ్రణమిల్లెడు దీనపాంథుల౯
క్రూరకుఠారఖడ్గముల
కర౯ బలివెట్టి రహో! కిరాతకుల్. 9

ఉ. కొందఱు బాణవర్షములఁ
గొంద ఱరాతికృపాణధారల౯
కొందఱు దండశూకములఁ
గొంద ఱవార్యశిలాప్రవృష్టిచే
గ్రుందిరిఁ కొందఱో గహన
మధ్యమున న్నడురేయి దాడిలోఁ
జిందఱవందరై నలఁగి
స్త్రీపురుషుల్ పసికూనలాదిగ౯. 10

ఉ. తూరుపు తెల్లవాఱఁ దమ
దోఁచిన యర్థములెల్ల నొక్కచోఁ
జేరిచి, యొండొరు౯ గలయఁ
జీరి, వనేచరచక్రవర్తికి౯
గూరుచువారలై, యొకటఁ
గొన్నిటిఁ బ్రోవిడి రా వనేచరుల్
చారుసువర్ణభూషలు ల
సన్మణిమండితతారహారముల్, 11

మ. చలిలో నద్రిగుహాముఖమ్ముల మహా
సాలాళిమూలస్థలిన్
దళితాంగవ్రణబాధలన్ బొగులు ధ్వాం
తగ్రస్తపాంథాళికిన్
వలిపోవన్ మృదురశ్మిసంగతిని జీ
వస్ఫూర్తి చేకూర న
జ్జ్వలతేజోమయమూర్తి తోఁచెఁ బ్రథమా
శామానసోల్లాసియై. 12

ఉ. అల్లనఁ గ్రమ్ము మంచుతెఱ
లవ్వలఁ ద్రోచి వనాధిదేవతా
పల్లవపాణి నవ్యసుమ
భాసురహాసముతో శకుంతికా
వల్లకి మీఁటె రాగరస
వాహిని దిక్తటి నిండఁ బద్మినీ
వల్లభు మ్రోల విశ్వము న
వద్యుతిఁ బొల్చె నహర్ముఖంబునన్. 13

సీ. తల దాఁచికొనఁ బోయి చిలువకాటునఁ దల్లి
కనుమూయ నక్కునఁ గదలుదాని
బాలభానుమయూఖజాలంబు తన్ సోఁక
ననిమిత్తహాసంబు లలరుదాని

శ్రీ మల్లాది శివన్నారాయణ

యాఁకొని చన్మ్రొట్టి యటమటింపఁగఁ జిన్ని
బొమముడిఁ గెంపారు మోముదాని
జాలిమై నంతంత జోలలం బాడు పు
ల్గుల రుతంబులకు నూఁకొట్టుదాని

తే. జీవలోకంబు కన్గప్పు చేవ విఱిగి
కటికిచీఁకటి యంతంతఁ గరఁగిపోవ
జోయదొర కిడ్డ సొమ్ముల ప్రోవుపొంతఁ
గానవౌకసు లోక పసికూనఁ గనిరి. 14

ఉ. కన్నులు విచ్చి నల్దెసలు
కన్గొని యేడ్చి కృశించి యాఁకటన్
జిన్నికరాంగుళుల్ మొగముఁ
జేర్చి హసింపఁగ నంతకంతకున్
వెన్నెలకందుపోల్కిఁ గను
విందగు నా పసిపాపఁ జూడఁగా
వెన్నవలెన్ గరంగె నట
వీచరవ్రజకఠోరచిత్తముల్. 15

ఉ. సొమ్ముల కాంతిపుంజమును
జూఱికొనంగల పిన్నపాపఁ దా
మమ్మొయి వీడిపోవ హృద
యమ్మది యొప్పమిఁ దస్కరోత్తముల్

కమ్మని పూవుఁ దేనియల
గ్రాస మమర్చి వినూత్నపద్మప
త్రమ్ముల నెమ్మినుంచి తమ
రాజున కిచ్చిరి భూషణాళితోన్. 16

క. అనపత్యుండగు వనచర
జనపతి యా శిశువు రత్నజాతముతోఁ దాఁ
గొని సంతస మందుచుఁ దన
వనితకు నిడె, నామె సాఁకె వాత్సల్యమునన్. 17

ఇది వింధ్యాటవి.

# నర్మదాతటము

~~~[:o:]~~~

సీ. పొదిగి తీరములందుఁ గదియఁ బర్విడు నంచ
పొలు పొప్పు నర్మదాపులినతటుల
విరు లొప్పు కింశుకతరులపై నెమిళులు
పురివిచ్చి నాట్యంబు నెరపు నెడలఁ
గొమ్మల కెగఁబ్రాఁకి కోఁతిమూఁకలు దుల్చు
ఫలవృష్టి శబ్దించు కొలఁకుదరుల
హరియూథములు చీల్పఁ గరికుంభముల రాలు
నురువైన ముత్యాలు దొరకు గుహలఁ

ఆ. బసితనాన శబరబాలికాబాలుర
తోడఁ గూడి యాడెఁ దోయజాక్షి
కన్నతల్లికన్న మిన్నగాఁ దన్నోము
వీరనాథుకాంత వేడ్కఁ బొదల. 1

చ. పసితన మేఁగ నెంచె, నతి
భాషణ మెగ్గనిపించె, నాటలన్
ముసరు కిరాతడింభకులు
ముట్టికొనన్ మది సంకుచించె, దృ
క్ప్రసరము సంచలించె, మధు
రస్వరవిస్తృతి మించెఁ బల్కులన్,
గుసుమమునందుఁ దావిబలెఁ
గోమలియం దెలప్రాయ మేర్పడన్. 2
~~~

చ. తనులత పల్లవింపఁ గను
దమ్ముల నుత్పలకాంతిసంపదల్
కనఁబడెఁ, బల్లవాధరము
కాంతులలోఁ జిఱునవ్వువెన్నెలల్
తనరెఁ, గపోలఫాలములు
దర్పణలీల హసించెఁ, బెన్నెఱుల్
ఘనత వహించె, నా శబర
కన్యకు యౌవనవేళ వింతగన్. 3

మ. హరిణీచేటిక లంత నంత గుములై
హాసప్రసన్నాత్ములన్
బరిశీలించుచు ముద్దులాడఁ, జరణ
ప్రక్షేపలీలాగతుల్
కరిణీసుందరు లభ్యసింపఁ, బికముల్
కంఠోక్తిఁ బాటింప, నా
తరుణీరత్నము పొల్చెఁ డాఁ బ్రకృతిసౌం
దర్యైకసంధాత్రి నాన్. 4

చ. అతివను బల్కరింతు రరు
ణాధరకాంతుల దంతచంద్రికన్
జతగొని తళ్కుఁజెక్కుల వి
శాలదృగంచలసీమఁ బొల్చు నా

స్మితరుచిఁ జూడఁ, దేనియలు
చిల్కు మృదూక్తి వినంగ, నర్మిలిన్
జతనముతోఁ బుళిందకుల
సారసనేత్రలు మాటిమాటికిన్. ౫

క. గురివెంద లాణిముత్యము
లురరత్నము లొకటఁ గూర్చి యురమున వ్రేలన్
ధరియింపఁజేసి చెంచెత
లరుణాధర నవ్వుచుండ నలరుదు రెపుడున్. 6

ఉ. పచ్చని తోరణా లలరు
పందిట బందుగు లెల్లఁ బ్రీతిమై
నిచ్చిన కానుకల్ గొనుచు
నీడగు పెన్మిటిఁ గూడు పుత్రికన్
మెచ్చుచుఁ జెంచెతల్ గలిసి
మేలము లాడఁగ వియ్యమందు నా
ముచ్చటఁ దీర్పఁగా జనని
మ్రొక్కికొనున్ గులదేవతాళికిన్. 7

ఆ. పైఁట వేసికొనెడు ప్రాయంబు రాఁ గూఁతు
నక్కుఁ జేర్చి తల్లి చెక్కు లంటి
మాపు రేపు కాళిమందిరంబున కేఁగి
మ్రొక్కుచుండు మనుచు ముద్దు గొనియె. 8

సీ. ఇన్నాళ్లు నాటల వెన్నాడు బాలురు
దూరానఁ దన్ జూచి దారి విడువ
నీటుపడుచులతో నెక్కసక్కెము లాడు
శబరయువకులు లో జంకి నిలువ
మూలల ముదుసల్లు ముంగిళ్లకుం బ్రాఁకి
చేనంటి చెక్కిళ్ల చెలువుఁ జూడ
దృష్టిదోషముఁ బాప దివ్వెలు వెలిఁగించి
వీథివాకిటఁ దల్లి వేచియుండ

తే. నిండుసంజలు కుంకుమ పండువేళఁ
జంద్రశేఖరునిల్లాలి చరణములకు
బోయదొరసాని కూఁతురు మ్రొక్కి వచ్చుఁ
బుడమి నడయాడు బంగారుబొమ్మవోలె. 9

ఉ. వాసరలక్ష్మి మేలుకొని
వల్లభుఁ గన్గొను వేళ, నంబుజా
వాసము వీడి శ్రావ్యముగ
బంభరడింభకపంక్తి గీతికా
భ్యాస మొనర్చు వేళ, చెలు
లందఱు తో నడ తేర నొక్కనాఁ
డా సతి యేఁగె నర్మదకు
నర్మిలి నీరముఁ దేర నొయ్యనన్. 10

క. నీరమ్ముఁ దేర నేటికి
సారసముఖు లేఁగి యచటి సైకతతటులన్
గేరుచు నంచలవెంబడిఁ
బాఱుచుఁ గ్రీడించి మోదపరవశ లగుచున్. 11

తే. పండువెన్నెలరాసులపగిదిఁ బొలుచు
పులినతలముల నొక్కింత ప్రొద్దుదాఁక
బడలికలు దీఱ మేనులు వాల్చి గాలు
లల్లనల్లన వీతేర హాయి నుండ. 12

ఉ. అక్కమలాయతాక్షి సఖు
లాటలఁ బాటల నుండఁ గొంత ప్రొ
ద్దెక్కినఁ దేఱిచూచి జగ
దీశ్వరిపూజకు వేళ మించె నిం
కెక్కడ నాలసింప జన
యిత్రికిఁ గోపము వచ్చు నంచుఁ దా
నొక్కతె యేఁగె నీటిదరి
కుజ్జ్వలభూషలు గల్లుగల్లనన్. 13

ఉ. "ఉండుము, పోద మేమిటనె
యుందుమె? తొందర యేల? మేము ర
కుండఁగఁ బోదువొక్కొ? యిటు
లొంటరివై" యని పల్కె నా సఖీ

తంసము౯ జీరికిన్గొనక
తామరసాక్షి ప్రఫుల్లపద్మినీ
మండితమా సరోవర మ
మందగతి౯ దరియంగ ముందట౯ 14

సీ. జడలైన పెన్సెలుల్ దడిసి మూఁపున వ్రేల
మొలబంటిమడువున నిలుచువాఁడు
కరఁగిన యపరంజిమెఱుఁగారు నెమ్మేన
నెలజవ్వనము మోసులెత్తువాఁడు
విరబూచి సౌభాగ్యభరితమై కనుపట్టు
కమలయుగ్మము నేలు కనులవాఁడు
పూచినకెందమ్మిఁ బోలు దోయిట ఛాయ
చిత్తహారికి నర్ఘ్య మెత్తువాఁడు

తే. కన్ను లరమోడ్చి జపియింపఁ జెన్నుమీఱు
పాటలాధరపల్లవప్రభలవాఁడు
కమలహల్లకసౌగంధికముల నడుమ
యువకుఁ డొక్కఁడు లోచనోత్సవ మొనర్చె. 15

ఉ. సారసనేత్ర యా మడువు
చక్కటి కేఁగి ప్రఫుల్లచారుపం
కేరుహానవ్యశోభఁ దిల
కించుచు నాతని మోముఁదమ్మిపై

హరివిలోచనాబ్జములు
హాయిగ నిశ్చలవృత్తి నుండఁ దా
నూరక నిల్చెఁ జిత్రగతి
నూర్పుట సైతము విస్మరించె నాన్ 16

ఉ. ఇన్నిదినాలనుండి మది
రేక్షణ కాననవాసిసోదరుల్
మన్ననఁ బెంపఁగాఁ బెరిగి
మానసవీథిని వారు తాను వే
అన్న దెఱుంగ లే, దిపుడు
యాత్రికుఁ జూడ నదేమి చిత్రమో!
తన్నొరుదానిఁగాఁ దలఁచెఁ
దా వొసఁగెన్ మధురానుభూతికిన్. 17

B.V.K

చ. విని కని తా నెఱుంగని న
వీనుఁడు చుట్టముపోల్కిఁ దోఁచెఁ, దా
ననిశముఁ జూచు నెచ్చెలుల
నప్పుడె కాంచినయట్టు లయ్యె, భా
వనలు తమంతఁ దామె బహు
భంగులఁ జుట్టఱికంబమర్చెఁ, దన్
గనుఁగొని రన్యు లన్ తలఁపు
గల్గె వనేచరరాజపుత్రికిన్. 18

చ. పొడమెడు బాలభాస్కరుని
 బుద్ధిగుహాంతరసీమ నిష్ఠమై
నిడుకొని యెల్లలోకములు
 నిండిన తేజములోన నేకతన్
దడవు జపించి యాత్రికుఁ డు
 దారసమాధినిమగ్నభావమున్
విడిచి ప్రశాంతచిత్తమున
 విప్పెఁ గనుంగవ నల్లనల్లనన్. 19

ఉ. ఆననచంద్రుఁ జేరు చికు
 రాంబుదపంక్తులు తేటవెన్నెలన్
దానము లాడఁ, గుందరద
 నద్యుతిలో నురుహారదీధితుల్
లీనము గాఁగ, గాలికిఁ జ
 లించిన పయ్యెద మీజి నద్దెసల్
మేని పసిండిక్రొందళుకు
 మించుతలోదరి తోఁచెఁ జూడ్కికిన్. 20

ఉ. "కాదు గదా యుషారమణి
 కమ్రసముజ్జ్వలశోణవల్కలా
చ్ఛాదితమూర్తి నియ్యెడ నె
 సంగెడు నీ శుభగాత్రి! నర్మదా

రాధనబుద్ధి నీ విధి వి
        రాజిలెనో! వనలక్ష్మి'' యంచు న
త్యాదరలీలఁ బాంథుఁ డరు
        ణాధరఁ గన్గొనె నిర్నిమేషుఁడై. 21

చ. కుతుకముతో బయల్వెడలి
        కూరిమికిన్ జన వీయనున్న త
ద్వ్రతిపతిచూడ్కి, యా శబర
        వారిజనేత్ర కపోలపాళిపై
ద్రుతగతిఁ బాఱె యెట్టెఁగా మ
        రుద్విచలచ్చికురంబు లంది, సు
స్థితిఁ గనె దంతచంద్రికలు
        చిందు సుధాధరపల్లవస్థలిన్. 22

ఉ. అంతఁ బుళిందరాజసుత
        యంగకముల్ పులకింప మారుతా
క్రాంతవినూత్నవల్లిక్రియఁ
        గంపితయై నునుసిగ్గు లోచన
ప్రాంత మలంకరింప వద
        నాబ్జము వాంచి కటాక్షనిర్గత
స్వాంతనిగూఢభావములు
        జాల్గొనఁ జూచుచు నుండునంతలోన్. 23

చ. బిరబిర వచ్చు నెచ్చెలుల
పిల్పు వినంబడఁ జంచలాక్షి దా
స్థిరముగ నిల్వఁగన్ గొలఁకుఁ
జేరుటకున్ మదిరాక యూరకే
కరగతపద్మపత్త్రిములు
గాంచుచు లెక్కిడుచుండె; మారుఁడే
గురుఁడు గదా మృగాక్షులకుఁ
గూరిమిదాఁపజికంబు నేర్పఁగన్! 24

ఉ. తీరముఁ జేరి యేమొ యొక
తీరునఁ దోఁచు పుళిందరాట్సుతన్
జేరి "యటన్ మనున్ విడిచి
చేసిన దేమిట నీ" వటంచు నా
చేరువ నున్న యా యువకు
చెన్నుఁ గనుంగొని యంద ఱొక్కమై
సారసనేత్ర నెమ్మనము
"జల్లన" నవ్విరి మంజులధ్వనిన్. 25

వ. చలనములేని క్షీరనిధి
చాడ్పునఁ బొల్చిన మానసంబునన్
గలిగిన యా వివర్తమును
గాఢతపఃపరిణామదక్షతన్

నిలిపి యథాప్రకారముగ
నిశ్చలచిత్తముతోడఁ బాంథుఁ డా
స్థలమును వీడె బాలికలు
సందడిచేఁతకుఁ జిన్నవోవఁగన్. 26

ఉ. పిండిన కావిశాటి భుజ
పీఠిపయిన్ జెలువార, నాత్మలోఁ
బండిన శాంతభావ మురు B.V.K
పద్మదళాక్షులు గ్రుమ్మరింపఁ, జే
గుండికఁ బూని యొంటరిగ
ఘోరవనిం బడి పోవు యాత్రికున్
వెండియుఁ జూడసాగె నట
వీపతిపుత్రి విషణ్ణనేత్రయై. 27

ఉ. నెచ్చెలు లెల్ల నా యువకు
నిర్మలభావము దివ్యరూపమున్
బొచ్చెములేని జవ్వనముఁ
బుష్పదళాధిక సౌకుమార్యమున్
మచ్చికతోఁ గనుంగొని ద్రు
మంబుల మాటునఁ గానరామికిన్
వెచ్చఁగ నూర్చి యందఱట
వీపతిపుత్రికఁ జూచి రొక్కటన్. 28

మ. కలలోఁ గాంచిన పెన్నిధానముక్రియన్
గాంచెం దదృశ్యుండు గాన్
కలఁపుల్ మీఱిన కోర్కు లొక్కొకటిగాఁ
దన్ జెల్లు వేధింప నా
జలజాక్షీమణి యొవగించుకొనియెన్
సౌభాగ్యసౌందర్యముల్;
ఫల మెన్నన్ బ్రియువల్లభత్వమె కదా
భూమాతనూజోభకున్! 29

చ. కలఁగిన చిత్తవృత్తి కడ
గన్నులఁ దోఁప, నితంబసీమలన్
జలదవినీలవేణికలు
చారుగతిన్ నటియింప, నొండొరున్
దొలఁగి యతిక్రమింపఁ గడుఁ
దొందరఁ జూపుఁ బుళిందకన్యకల్
పిలపిల సాగి రింటిదెసఁ
బ్రీతియు భీతియు సందడింపఁగన్. 30

ఇది నర్మదాతటము.

——/o/——

# వనావలోకనము



సీ. సెలయేళ్ల జాదెముల్ వెలిముబ్బుతలపాగ
ధరియించి నిలుచున్న ధరణిధరము
ఆదికూర్మస్వామి పాదమూలము నంటు
నాయతంబగు కొండలోయగముల
సత్యలోకముదాఁక సాఁగిన సిగలపైఁ
బుష్పపల్లవశోభఁ బొల్చు తరులు
చీమకుఁ జొరరాక చీఁకట్లు నెలవైన
నపమార్గదుర్గమవిపినవీథిఁ

తే. బాఱఁ జూచుచుఁ బ్రకృతిసౌభాగ్యమునకు
హర్షవిస్ఫారితాక్షుఁడౌ యాత్రికుండు
చెంతఁ బొదలందు నెవ్వియో మంతనంబు
లాడు విధ మున్న గుసగుస లాలకించె. 1

మ. "బలిమిన్ బట్టుదుమేని పాఱుఁడు భయ
భ్రాంతిన్ మృతిన్ జెందునో!
చలితస్వాంతుఁడు గాక తా నెదిరినన్
శస్త్రాహతిన్ బొందునో!
వల దీ చందము జేఁడు విన్న మనలన్
బ్రాణాలఁ బోనిచ్చునే?
నిలువుం డేనిదె పూరుషోత్తము నిటన్
నేఁబొప్పఁ దోడ్తెచ్చెదన్." 2

కం. అను మాటల వెనువెంటనె
కనుపట్టె నొకండు దీర్ఘకాయుఁడు దృప్య
ద్వనగజము మనుజసవ్వడి
విని దారికి నడ్డువచ్చు విధ మెదఁ దోఁపన్. 3

చ. కనకధరాధరంబుఁ గనఁ
గాటుకకొండకుఁ గోర్కె గల్గెనో
యన నపు డావనేచరుఁడు
యాత్రికుముందుకు సాగి, యెద్దియో
మనసున నున్నదానిని స
మంచితరీతిని దెల్పుపూనికన్
గనుఁగొనె శాంతరమ్యశుభ
కాంతుల నొప్పెడి తన్ముఖాబ్జమున్. 4

తే. అప్పు డా బోయఁ డెద్దియో చెప్పఁబోయి
చెప్పఁదలఁచిన మాటలోఁ దప్పు తోఁచి
కొంత మాతని మోమునన్ డిందువడఁగ
మేను బ్రాన్పడ నిలిచె నిమేషమాత్ర. 5

తే. అట్టి బోయని చందంబు నరసి తానె
యనుఁగుఁజుట్టంబుపోలిక నాదరించి
కరుణ శాంతము చూడ్కులఁ గడలుకొనఁగఁ
బలికె నాతఁడు తేనియ లొలుకునట్లు. 6

శా. అన్నా! యెవ్వరివాఁడ వీవు? శుభమే
యారణ్యకశ్రేణికిఁ గీ
తెన్నుల్ బట్టి చనంగ నాశ్రమము లీ
తీరానకున్ దూరమా?
నన్నేమో యడుగన్ దలంచినటు లు
న్నా, వేల సంకోచ? మిం
కన్నీ నెమ్మది నున్న దున్నటులు ప
ల్కన్ రాదొకో మిత్రమా! 7

తే. జీవకుసుమంబు వికసించి చెలఁగుకొలఁది
నంతకంతకు నామోద మతిశయించె;
నల్లనల్లన మాటాడ నుల్లమందు
బోయనికి నెంతయున్ వేడ్కపొడమె నంత. 8

క. బంగారు మీఁజు చాయన్
బొంగారెడు జవ్వనంబు పొల్చిన భవదీ
యాంగంబు ఖడ్గధారల
సంగతిఁ గనఁ జూచు కర్మచండాలుండన్. 9

క. మా యేలిక యీ వేళన్
బోయల కిడె ముదల నొక్కపూరుషుఁ దేరన్
మా యంబకు బలి నిడఁగా
నీ యడవిన్ వెదకి కంటి మిచ్చట నిన్నున్. 10

క. మోసానఁ దెత్తు నేనని
నాసంగడికాండ్ర కెల్ల నచ్చఁ బలికి యీ
దోసానకు నొడిగట్టితిఁ;
జేసిన పాపంబు లెల్లఁ జెప్పినఁ బాయున్. 11

క. స్వామిద్రోహి నటంచున్
నా మిత్త్రులు దెల్ప వీరనాయకుఁ డలుకన్
నా మస్తము గొడ్డంటన్
భూమికి బలివెట్టు టదియ పున్నెము నాకున్. 12

ఆ. అంతె కాని మిమ్ము నచటికిఁ గొంపోవఁ
గాళ్లు రావు నాకుఁ, గరుణఁ జూడు
మనుచు మ్రొక్కఁ బోవు వనచరు వారించి
యాత్రికుండు వాని కనియె నిట్లు. 13

ఆ. తప్పు చేసినట్లు తల్లడిల్లెద వేల?
దోస మేమి నీది వీస మైన?
రాజునాజ్ఞ దాఁటరాని దౌ భటునకు
నింతమాత్ర కింత వంత యేల? 14

క. జాలి యటన్నది డెందము
గాలించిన లేని జన్మఁ గాంచియుఁ గరుణా
శాలివి స్వామిద్రోహం
బేలా యిటు చేయ నిశ్చయించితి? వనఘా! 15

క. నీవును స్వామిద్రోహివి
గా వలవదు నేను మిత్త్రఘాతకుగతికిఁ
బో వలన దట్టిచందము
గావింతము లెమ్ము రమ్ము కాళిగుడి దెసకు. 16

ఆ. మాఱువల్కు నోడి మన మురియాడంగఁ
దత్తఱమున బోయ దారిఁ జూప
మందహాస మాస్యమందుఁ జిందాడంగ
యాత్రికుండు వాని ననుసరించెఁ. 17

ఇది వనావలోకనము

# శబరావాసము



సీ. చిన్నఁబోయిన మోము చెమటముత్తెపుసరుల్
చికురాళి కొక వింతచెలువుఁ గూర్పఁ
గటిమీఁద నిడుకొన్న కలశంబుబరువుచే
నసియాడి పేదకౌ నడలుకొనఁగఁ
దడిసి మైనంటిన స్తనవల్కలముమీఁద
ముత్యాలహారంబు ముద్దు గుల్క
మీఁగాళ్ల జీరాడు మేలికుచ్చెళ్లను
మొత్తంబు డాకేల ముడిచి పట్టి
తే. కలశసంగతిఁ గంకణక్వాణన మొప్ప
నల్లనల్లన నిలు సేర నరుగుదెంచు
పుత్రి కెదురేఁగి శబరేంద్రుపువ్వుఁబోణి
డెంద ముప్పొంగఁ గలశమ్ము నందుకొనియె. 1

తే. చెన్నుఁ దఱిగిన నెమ్మోముచెమటఁ దుడిచి
చెక్కిళుల్ దువ్వి ముంగురుల్ చిక్కు దిద్ది
కూఁతునం దెద్దియో క్రొత్త గోచరింప
బోయదొరసాని యిటు పల్కె మురిప మెసఁగ. 2

ఉ. తేప దొఱంగె నెమ్మొగము,
దీనత దోఁచెను గన్నుఁదోయి, ని
న్నాటలఁ బాటలన్ జెలులు
హాస్యము లాడిరె తల్లి! నొవ్వఁగా

నేటికిఁ వేకువన్ జనితి
వింతటి జాగున కేమి హేతు, వీ
పూఁటకుఁ గాళిపూజ కెటు
పో నగుఁ? జాతర యంద్రు నేఁడటన్ 3

ఉ. భిల్లపురంధ్రులున్ వెదురు
బియ్యపుటన్నముమీఁద దేనియల్
జల్లిన బోనపుట్టికల
సానికలం దమరించి వేడ్కమైఁ
దల్లులు బిడ్డలుం గలిసి
తమ్మటసద్దులతోడ ముందుగా
నుల్లడక్రిందఁ గాళిగుడి
కుత్సవమున్ గనఁబోదు రమ్మరో! 4

ఉ. జాతరఁ జూడ వత్తు రిట
శైలవనంబుల నుండు బంధుగుల్,
చేతము లుల్లసిల్ల మన
చెంచులు చెంచెతలెల్లఁ గూడి మైఁ
బూఁత లెసంగ నయ్యెడకుఁ
బోవుదు రుత్సవముం గనంగ, సం
ప్రీతిని నిన్నుఁ దండ్రి పిలి
పించునొ ప్రేముడి వారు చూడఁగన్ 5

ఉ. తల్లులు దండ్రులుఁ గడు ము
దంబునఁ జూతురు పెండ్లియాడు రా
జిల్లెడు బోయకన్నియలు
కన్గవ సిగ్గు దొలంకఁ గాళికిన్
గల్లను దంతిదంతకర
కంకణశబ్దములోన మెల్లగాఁ
జల్లనితల్లి! యీఁగదవె
చక్కనిపెన్మిటి నంచు మ్రొక్కఁగన్ 6

ఆ. అనుచు బుజ్జగించు నమ్మసంప్రీతికై
తెచ్చికోలునవ్వు తేటపడఁగ
నింతి విననియట్లు లిటు నటు నడయాడె
లేఁతసిగ్గు చూడ్కిలీలఁ దోఁప. 7

ఆ. ప్రీతితోడఁ దల్లి జాతరకై కొన్ని
వస్తుతతులఁ గూర్చు పనుల నుండెఁ
జండభానుఁ డంత నిండుజవ్వనమున
మింటిమధ్య మధిగమించి మించె. 8

ఉ. పండిన నిప్పు లెల్లెడల
భాస్కరుఁ డుద్ధతిఁ గ్రుమ్మరింప వే
దండము లుండె నీటఁబడి,
తావులలో మృగపక్షిసంతతుల్

గండటి మిన్నకుండె విధి
కాటియఁ దాఁ దల యొగ్గి యోర్చె నాన్,
నిండుఁదనంబునన్ జగతి
నిశ్చలతన్ గనుపట్టె వేసవిన్. 9

చ. పరిణతదాడిమీఫలశు
భ్రప్రభతో రవిబింబ మొప్పె, వి
స్త్రరతరుమూలముల్ విడిచి
చల్లనినీడలు తూర్పుదిక్కుకున్
పరువిడ సాగె, నిర్మలన
భఃపరిణాహము సాంధ్యరాగభా
స్వరతఁ జెలంగె, విశ్వము ప్ర
సన్నత నొందె దినాంతవేళకున్. 10

చ. అతివ లతాప్రతానసుమ
హారిగృహాంగణసీమ నిర్ఝరో
త్పతనవిశీర్ణశీకరవి
తానము పొల్చిన చోట స్వేదసం
గతతనువల్లరిన్ దనుపు
గాలికి నల్లన వచ్చి నిల్చె ను
ద్గతపతగావళీమధుర
గానవినోదనిబద్ధబుద్ధియై. 11

చ. అదియ గృహంబు; శాబరస
మాశ్రయ మయ్యెదె; శైలనిర్ఝరా
స్పదములు నవ్వియే; మఱి శకు
ంతానవభావనవీథి నల్లనన్
బద మిడినట్టి భావముప్ర
భావ ను దెట్టిదొ! సర్వవస్తుసం
పదలు వినూత్న భావముల
భాసిలె బాలమృగాక్షిచూడ్కికిన్. 12

చ. తొలకరిలో మెఱుంగులటు
తోయజలోచన నెమ్మనంబునన్
బలుమఱు పూర్వపుణ్యమధుర
భావపరంపరలే రహింప లో
నలరు; సఖీజనంబులకు
నవ్విధముల్ దగఁ దెల్ప నాత్మలో
నులుకు; నవప్రవాళకుసు
మోచ్చయముల్ గను రిత్తచూడ్కులన్.13

చ. వల పన నెట్టిదో కనని
వారిజలోచన యల్ల నర్మదా
పులినతలమ్మునన్ గనిన
మోహనమూర్తిఁ దలంచు; మేనఁ గ్రొం

బులకలు గాంచి సిగ్గుపడు;
మున్నట నాతనిఁ జూచి నవ్వుచున్
జెలు లనినట్టి యానుడులు
చిత్తమునన్ దలపోయు మాటికిన్. 14

చ. అనుకొను, సిగ్గు పైకొనిన
యంతట నెప్పటియట్ల యేమి లే
దనుకొను, "నెచ్చెలుల్ తన ము
ఖాబ్జముఁ గన్గొనినప్పు డాత్మ నే
మనుకొనిరో" యటంచు క్షణ
మట్టె కనుంగొనుఁ, జెంత మావిక్రొ
న్ననలఁ గనంగ నా యువకు
నవ్యతనుద్యుతి నెంచుఁ బ్రేముడిన్. 15

చ. సరసిజనేత్ర యిట్టులు ర
సాలవనిన్ విహరించునంత, స
త్వరగతి వచ్చె నచ్చటికి
వారిజలోచన యోర్తు వల్కలం
బురమున జాఱ, వెచ్చనగు
నూర్పులు మీఱ, వతంసపుష్పముల్
తెరువున వ్రాలఁ, గన్నుఁగవ
దీనతఁ దేల, వికంపితాంగియై. 16

ఉ. చూచితె నెచ్చెలీ! యువకు
సుందరు నొక్కనిఁ దెచ్చి, రెట్టివేఁ
నీచపుఁ జెయ్దముల్ మన వ
నేచరజాతికె చెల్లు, నాతనిఁ
గాచుచుఁ జీరుచుఁ జనిరి
కాళికకుం బలివెట్టఁ; బెండ్లికిఁ
వేచనులీల నేఁగె మది
భీతి యొకింతయు లేక యాతఁడుఁ 17

ఉ. కాననభూములఁ గనక
కాంతులఁ దానము లాడఁజేయుచం
దాన వెలుంగు నాతని ని
దానముగా మదిఁ బోల్చనైతి, నా
కా నవమోహనాంగుఁ గని
నప్పుడు ప్రొద్దున నర్మదాతటిఁ
గానఁగనైన యాత్రికుఁడు
కాదు గదా యనిపించె మానినీ! 18

చ. పదుగురు చుట్టునుం దవిలి
బల్లెములఁ జళిపించి యుగ్రతఁ
"పద పద వేగ" మన్ పరుష
భాషలఁ దన్నలయించుచుండ నా

సదయుని మోమునన్ బరమ
శాంతమె తోఁచుచునుండె; నింక నె
య్యది యెటులైన నేఁగి మన
మాతని నేర్పడఁ జూడఁగావలెన్. 19

చ. అన విని మాట లేక, హృద
యాబ్జము జల్లన, మున్ను తాను జిం
తన మొనరించు రూపు మది
దాఁటి చనంగఁ, బదంబు తొట్రిలన్,
మునుకొను నశ్రులన్ వెనుక
ముందులు గానక, కాళికాలయం
బునకుఁ జనెన్ మృగాక్షి తన
ముంగల నెచ్చెలి పర్వులెత్తఁగన్. 20

ఇది శబరావాసము

~~~[:0:]~~~
~~~

# కాళీమందిరము

ఆ. శక్తిఁ దేఱిచూడఁజాలని చూలాండ్రు
దూరదూరముగనె తొలఁగి నిలిచి;
రధికకుతుక మొప్ప నర్భకావలి పొల్చెఁ
గోఁతు లట్లు చెట్లకొమ్మలందు.

ఉ. బారులు దీరి నిల్చి రిపు
ప్రక్కల దుర్గకు బోయ; లావిరుల్
వాఱెడు బోనపుట్టికల
బంతులు దీర్చిరి ముందుబోయతల్;
బోరు కలంగు తమ్మటల
భూరిరవంబు నభోంతరాళవి
స్తారిత మయ్యె; నంత నసి
ధారి వనేచరనాథుఁ డుద్ధతిన్.

ఉ. కాలఘనాఘనప్రభలఁ
గాయము నించి, లయాగ్ను లక్షికో
ణాల సృజించి, రాహుదశ
నద్యుతిఁ గోఱల నించి, యంతకో
ద్వేలమదంబు నాలుకను
దించి, హసించెడుపోల్కి నున్న యా
శూలధరార్ధ దేహపయిఁ
జూడ్కుల నిల్పె సునిశ్చలాత్ముఁడై.

ఉ. అంతకు మున్నె లుబ్ధకులు
యాత్రికుఁ దోడ్కొని వచ్చి; రా మృడ
స్వాంతుఁడు వారి యాజ్ఞ గిరి
జాలయ తోరణభూమి దాఁటి ని
శ్చింతగ లోని కేఁగె మద
సింధురసుందరయాన మొప్ప; వి
భ్రాంతిమెయిన్ గనుంగొనిరి
బాలురు వృద్ధులు తన్ముఖాబ్జమున్. 4

క. గుసగుస లుడిగెన్ గుడిలోఁ,
బస చెడి తమ్మాటలు మూకభావముఁ దాల్చెన్;
గసిమసఁగిన కాలాబ్దము
వసుధన్ వర్షించి వెలియువడువునఁ దోఁచెన్ 5

మ. కరుణాసింధుతరంగసంతతులకున్
గాణాచియా చూడ్కిలో
దరహాసాంకురచంద్రికల్ మెఱయ నా
ధాత్రీసురుం డాతతా
దరలీలన్ గనెఁ గాళికాలయమునన్
దర్పోద్ధతాకారులన్
నరహింసారతులన్ బుళిందపతులన్
నానాయుధోపేతులన్, 6

చ. జగములఁ గన్నతండ్రి యటు
చల్లని చూడ్కులఁ జూచు పాంథు
నెమ్మొగముఁ గనంగ లుబ్ధకస
మూహము నాత్మలలోనఁ గల్గె నె
వ్వగయొ ప్రియంబొ నైజమ; భ
వాంతగభావవిలీనసంస్కృతుల్
తగులు మనంబు రమ్యగుణ
దర్శనవేళలఁ బ్రాణికోటికిన్.

సీ. శతకోటిదుర్భేదశైలహృత్తటముల
జాలిమొక్కలబారు సౌరు పొల్చెఁ
గ్రౌర్యతీవ్రకరాగ్నిఁ గ్రాఁగిన మరుభూమి
శాంతరసావాప్తి జౌకువాఱె
గాఢాంధకారంబు కాఁపున్న గుహలలో
బోధవిద్యుల్లతాస్ఫూర్తి తోఁచె
మనుగడ యను మింటఁ గనుపట్టె నడురేఖ
పశుభావమానవభావములకుఁ

ఆ. దీర్ఘసేవి శాంతదివ్యతేజస్స్ఫుర
దృష్టి సోఁకినంత దిక్కు తోఁచె
వీరనాయకుండు వెలి గాఁగ నచ్చోట
మాఁగియున్న బోయమూఁక కెల్ల.

శా. పర్ణాచ్ఛన్నపయోధరాగ్రతటులన్
బాహాద్వయిన్ లోఁచి యా
కర్ణాంతప్రసరత్కటాక్షలహరీ
కల్లోలపుంబీఠిపై
వర్ణి న్నిల్పి కిరాతకన్య లతనిన్
వర్ధిల్ల దీవించి రా
వర్ణాతీతపువాక్కు నంగజుఁడు తా
వాంఛించి యాలింపఁగన్. 9

B V. K.

ఉ. క్రూరకుఠారధారులగు
కోయదొరల్ మది జంకి మిన్న కే
దారి యొసంగ, జోయతలు
తన్ముఖపద్మమునందుఁ జిత్తముల్
జేరఁగ, జాలిమై లిఖిత
చిత్రములో యన నిల్వ, నిర్భయా
కారత యాత్రికుండు నర
ఘాతి వనేచరనాథు చెంతకున్. 10

ఆ. చేరునంతలోనఁ జెంచులరాయండు
శక్తిమీఁదఁ జూడ్కి సడలఁ జేసి
వెనుక మరలి చూచె వివిధవాద్యధ్వనుల్
మాటువడె నిదేమి మాయ! యనుచు. 11

ఉ. ఫుల్లసరోజనేత్రుఁడు ప్ర
పూర్ణకృపాభరణుండు వాగ్వధూ
వల్లభమూర్తి భక్తజన
వశ్యుఁడు విశ్వకళానుభూతి రా
జిల్లెడువాఁడు జ్ఞానసుధఁ
జిల్కెడు హాసమువాఁడు పాంథుఁ డా
భిల్లకులావతంసున క
భీతమతిన్ గనుపట్టె ముందటన్. 12

క. మదమున్ ముదముం బొదలన్
గదనానకు నిలుచుపోల్కిఁ గడు ధీరతతో
నెదురెదురుగ నొండొరులన్
గదలక వారిట్టె క్షణము కనుఁగొనువేళన్. 13

సీ. పండు నిప్పులు చల్లు చండదృక్పరిసరంబు
క్షీరాబ్ధి తరఁగలఁ జిందులాడె
నంజనాచలకాంతి నదలించు తనురుచుల్
కనకాద్రితటిఁ దాఁకి వెనుక కొదిఁగె
మింటి రిక్కల రాల్చు మేటియాశౌర్యోష్మ
శాంతాబ్ధి పైకొన జడతఁ బూనె
నద్రుల నెగఁజిమ్ము నౌద్ధత్యపుఁబిశాచి
పరతత్త్వపృష్టికిఁ బరుగువాఱె

తే. భూతసంతతిలోఁ గ్రొత్తపొలుపు వొడమెఁ
దన్నుఁ దా మోసగించిన తలఁపు పుట్టె
మేరుగిరిపొంతఁ దా నున్న తీరు దోఁచె
యాత్రికుని మ్రోల నిలిచిన వ్యాధపతికి. 14

మ. భయమో భక్తియొ విస్మయంబొ కనులన్
బాష్పంబు లూరెన్, దమో
మయ మర్త్యున్ భువి, యావనేచరసభా
మధ్యస్థుఁడౌ బోయకున్
స్మయనిర్బంధము వీగ హస్తగతమౌ
శస్త్రంబు నిస్త్రాణమై
దయనీయస్థితి తోఁప నేలఁ బడె నా
ర్తధ్యాన మేపారఁగన్. 15

ఆ. వాలు నేలఁ గూల వనచరనాథుండు
ఖిన్నుఁ డగుచుఁ గతము నెన్న లేక
తనదు తొంటిపెంపుఁ దలపోసె నిట్టులు
చెదరిపోవు మనసుఁ జిక్కఁబట్టి 16

చ. రవికిరణోత్కరంబు చొర
రాని మహాటవి గొట్టురాలపై
గవి గుఱుకొట్టు బెబ్బులుల
కన్నులవెల్గునఁ బుట్టె గూఢపా

న్నవవిషఘ్నాత్క్రియోన్నతఘ
నాతతి నీడల వర్ధితుండనై
యవనిఁ జరింతు, నా మది భ
యాకుల మయ్యె నిదేమి చిత్రమో! 17

మ. తను వాకాశఝరీతరంగవిచల
త్తల్పంబుపైఁ దేలె, జీ
వనధాతుప్రకరంబు సంకుచితమై
వాంఛించె శూన్యస్థితిన్,
మన సొప్పారె నభూతపూర్వరుచులన్
మన్నించు నూత్నాకృతిన్,
గొనిపోయెన్ నను నెద్దియో యెచటికో
కొంగ్రొత్తలోకానకున్. 18

క. అని చింతించు కిరాతుఁడు
తను వద్రిజపాదపీఠతటిపై నొఱఁగన్
గను మోడ్చి ధ్యానమగ్నతఁ
గనుపట్టెన్ సుప్తమీనకాసారము నాన్. 19

ఆ. రాహుముఖముఁ జొచ్చు రవిమండలముపోల్కిఁ
దీవ్రరూప ముడిగి దీనుఁడైన
వనచరేంద్రుఁ జేరి కనికరం బొప్పంగ
యాత్రికుండు మెల్ల ననియె నిట్లు. 20

శా. అన్నా ఆటవికావతంస! భవదీ
యాజ్ఞన్ శిలాకంటక
చ్ఛన్నంబైన యరణ్యభూమిఁ బడి రా
జా గయ్యె, రుద్రాణి యా
కొన్నన్ విశ్వము తాఁబుమాఁ బగుఁ జుమీ!
క్షుభ్యద్భవానీక్షుధో
త్పన్నక్రోధదవాగ్ని నార్పఁ గదె మ
ద్రక్తోరుధారార్ఘ్యకన్. 21

ఉ. ప్రొద్దుటినుండి దీక్షమెయి
భుక్తిఁ దొఱంగి కృశించి యాఁకటన్
బెద్దయు వేచియుంటి విటు
భీమకృపాణము నేల వైచి నీ
వెద్దియుఁ జూడ వేమి? జగ
దీశ్వరి యాఁకటిచిచ్చుమంటలు
ద్యద్దవలీల రేఁగి గగ
నాంగణసీమలు మీఱెఁ, జూచితే! 22

ఉ. అచ్చపుభక్తి నంబికకు
నర్చన లీవొసరించి యిచ్చు నా
వెచ్చని రక్తపారణము
వేడ్కమెయిం గనులారఁ జూడఁగా

వచ్చిన బంధుబృందముల
వాంఛలు నమ్మగ విన్నఁబాటునన్
ఱిచ్చపడంగ నేటికి? ధ
రింపు కృపాణము, లెమ్ము గ్రక్కునన్. 23

చ. ఘనతరదీక్షఁబూని చిర
కాలము నంబికఁ గొల్చుచున్న నీ
మనసున నంకురించి యువ
మానవరక్తజలాభిషిక్తమై
దినదినమున్ ప్రవృద్ధమగు
దివ్యమనోరథవల్లి యక్కటా!
ననఁ దొడఁగెన్, ఫలించు నిఁక,
నాశముఁ జేసె దిదేల? మిత్త్రమా! 24

ఉ. దిక్కులు చూచి వ్యాధకుల
దీపకుఁ డల్లన లేచి కాళిపై
మక్కువ యాత్రికోత్తము స
మంజసవాక్కుల కాత్మలోనఁ బెం
పెక్కిన శాంతభావము న
హీనగభీరవినీతభావమున్
జెక్కులపైఁ దడంబడఁగఁ
జేతులు మోమునఁ జేర్చి యిట్లనన్. 25

చ. అడవిమృగాలలో నొకఁడ
నై జనియించితి, నాయు వెంతయో
నడచె, నృశంసకర్మముల
నవ్యసుధామయజీవలోకముఁ
బాడగనఁ గల్గె నీ భువన
పూర్ణకృపారసవృష్టిఁ జేసి, నా
చెడు చెయిదమ్ములన్ మనసుఁ
జేర్పక కావఁగదే కృపానిధీ! 26

చ. కరుణ యొకింత లేక కల
కాలము కాల్చినెపాన నేను భూ
సురరుధిరాంబుధారఁ బశు
శూన్యవనీస్థలిఁ బాపసస్యముల్
పెరుఁగఁగఁ జేసినాఁడ, నిఁక
భీకరతత్ఫలభుక్తిఁ ద్రోయ నా
తరమె? యనుగ్రహించి నను
ధన్యునిఁ జేయఁగదే కృపానిధీ! 27

ఉ. మానవు తృప్తికే తరులు
మంజులపుష్పఫలమ్ము లిచ్చు, స
మ్మానముమైఁ బశూత్కరము
మాధురి నొప్పెడు దుగ్ధ మిచ్చు, నీ

భూనభముల్ మనుష్యునకు
భోగనిధానపు దేవరాజ్యముల్,
మానవఘాతికిన్ మదిని
మానునె తాప? మీఁ కేమి సేయుదున్? 28

ఉ. పున్నమచందురున్ బుణికి
పుచ్చికొనంగల నవ్వువెన్నెలల్
కన్నులఁ జల్లఁజేసె, నిఁక
గాఢహృదంతరతాప మార్పు మో
యన్న! సుధాస్రవంతికల
కాసలు గొల్పు వచఃప్రవృష్టి నా
పున్నెపుఁబ్రోవ! నీ విటకుఁ
బూరుషరూపముఁ దాల్చి వచ్చితే! 29

ఉ. భావనవస్తుసంతతికి
భవ్యతరాకృతు లిచ్చుచుండుఁ, ద
ద్భావన దుష్టమైనయెడ
భావితవిశ్వము దుష్టమే యగున్;
భావనమూర్తి యీతుహిన
పర్వతపుత్రి మదీయభావనా
భావితమూర్తి యైఁ దెలుపుఁ
బ్రస్ఫుటరీతి మదీయదౌష్ట్యమున్. 30

క. అని యిట్లు వనచరేంద్రుఁడు
తనుయష్టి చెమర్చ, మాట తడఁబడ, నశ్రుల్
కనుగొనల జాలువాఱఁగ,
ననుతప్తుఁడు వ్రాలెఁ బధికు నంఘ్రిద్వయిపైన్ 31

చ. పదముల వ్రాలు వ్యాధపతిఁ
బట్టి కవుంగిట గ్రుచ్చియెత్తి యా
సదయుఁడు పల్కె సూనృతవ
చఃపరిపాటి వనేచరావళుల్ B V.K
కదలక యబ్బురెత్తి వినఁ
గాననభూమి శకుంతసంతతుల్
మదకలకూజితం బుడిగి
మంజులవాక్సుధ నాదరింపఁగన్. 32

చ. అడలకు మన్న! నీవ యిటు
లార్తిఁ గృశించుకతమ్ము బందుగుల్
తడవి యెఱుంగనేరమిఁ
దల్లడ మందుచు నున్నవారు, నేఁ
బొడఁగనఁ జాల నశ్రుపరి
పూర్ణవివర్ణము నీ ముఖాబ్జమున్,
జెడుఁగది నీవు నా యెడలఁ
జేసిన దేమి? వనేచరాగ్రణీ! 33

చ. పసుబలగర్వమోహదృఢ
బంధములన్ దెగఁ ద్రెంపి, విస్ఫుర
న్నిశిత కృపాణముల్ చెనక
నేరని ధామముఁ జేరి, యద్రిజా
శిశిరకృపాస్రవంతి నభి
షిక్తుఁడవై, వెలుఁగొందు నీ విఁకన్
వ్యసనపడంగ నేమిటికి
వ్యాధపతీ! శుభవేళ నీక్రియన్. 34

చ. అరసి కృపాకృపాణముల
యంతరమున్ బొడగంటి, వీ
చరాచరములలో నిగూఢమగు
శాశ్వతసత్యము నాకళించి, తో
వరకరుణానిధీ! విపుల
పర్వతసీమ వసించు ప్రాణులన్
జిర మనురక్తి నేలు మని
చెప్పెడి దే మిఁకఁ, బోయి వచ్చెదన్. 35

క. అని పల్కి యాత్రికుం డట
తన గురువరునాజ్ఞ నర్మదాతటిఁ దపమున్
బొనరింపఁ బోయె శాబర
జననాథుఁడు గారవింప సమ్మదలీలన్. 36

ఉ. నెచ్చెలిఁ గూడి పిన్నట న
　　నేచరపుత్రిక కాళికోవెలన్
జొచ్చి యపూర్వసమ్మదము　　B·V·K
　　శోభిలు బంధులఁ గాంచి వారు లో
మెచ్చిన మర్త్యహింస విర
　　మించుట కాత్మఁ జెలంగెఁ, గాని తా
నచ్చిన యాత్రికుం డటఁ గ
　　నంబడమిన్ దురపిల్లె దీనతన్.　　37

చ. తొలుతటి పుణ్యశేషమునఁ
　　దోఁచె సుధామయమూర్తి చూడ్కికిన్
ఫలముగ, వెండియున్ గనెడు
　　భాగ్యమె కల్గిన నేల దృష్టికిన్
దొలఁగు నతం డటంచు మదిఁ
　　దోఁపఁగరానివి తోఁచుచుండఁ దా
నిలువక యేఁగె నింటిదెస
　　నీరజలోచన విన్నఁబాటునన్.　　38

సీ. తొట్రుపాటునఁ దల్లితో నెద్దియో తెల్పఁ
　　గాఁ బూని విరమించి కళవళించుఁ
బరిహాసమున కాటపాటల ననుమాట
　　తనకుఁ దాఁకినయట్లు తలఁచి యులుకుఁ

జెంచెతల్ యాత్రికు శీలంబుఁ గొనియాడఁ
జెవి యొగ్గి విని కొంత సేద దేఱు
నింతమాత్రన నేల యిట్టు లైతి నటంచు
పలుమాఱు ధైర్యంబు పాదుకొల్పు

తే. ఇంతి యెవ తెయొ వచ్చి తనంతఁ దానె
యాత్రికుని జాడఁ దెల్పుట కాససేయుఁ
గాళి దర్శించి నెచ్చెలిఁ గలిసి వచ్చి
రమ్యశుభగాత్రి శాబరరాజపుత్రి. 39

ఉ. చిక్కని తావులన్ దెసలఁ
జిమ్మెడు నవ్యలతావితానముల్
చక్కని మావిగున్నలకు
సాగి పెనంగొనఁ బుష్పగుచ్ఛముల్
క్రిక్కిరియంగఁ గన్గొని మృ
గీదృశ యేమని లోఁ దలంచునో!
యొక్క క్షణంబ యేని సుఖ
మొందదు రమ్యవనాంతసీమలన్. 40

చ. "అనుపమరక్తిఁ దెల్పు సుమ
హాసముఁ గాంచి మిళింద మొయ్యనన్
జని మధురస్వనంపుసర
సంబులు వల్కి మరంద మిమ్ములన్

దనియఁగఁ గ్రోలఁ బుష్పలత
ధన్యతఁ గాంచె; నిఁ కెంత కాల మిా
మనుగడ నీదుదాన" నని
మానిని పోలు నితాంతఖిన్నయై. 41

ఉ. పుట్టినతోడనే విషమ
భూములలోఁ బడి వృక్షమూలముల్
వట్టి ధరాధరప్రకర
పాదములన్ స్పృశియించి యెట్టటో
నెట్టన నర్మదాధుని ధు
నీప్రియుఁ గూడుటఁ గాంచి యింతి తాఁ
బుట్టినయింట నుండ నిఁకఁ
బోల దటంచుఁ దలంచె నెమ్మదిన్. 42

ఆ. ఇరుగుపొరుగుబోయయిల్లాండ్రు తమలోన
బాల యునికిఁ జూచి జాలిఁ జెంది
కూఁతుఁ దలఁచి లోనఁ గుందుచుండెడి తల్లి
కిట్టు లనిరి ప్రేమ యుట్టిపడఁగ. 43

ఉ. ఇన్నిదినాలు మాకు మది
రేక్షణఁ జూచినయంత నెంతయున్
గన్నులపండు వయ్యెడిది;
కారణ మేమొ యెఱుంగ మిప్పు డీ

చిన్నది నాఁడునాఁటి కెటు
చిక్కినదో కనుఁగొంటె! యింతి మైఁ
గన్నులు పాటలాధరము
కాంతియుఁ దక్కఁగఁ బ్రాణ మున్నదే? 44

తే. ఈడు వచ్చిన కన్నియ లిట్టు లుండఁ
గూడునే? మీఁద నెద్దియేఁ గూడెనేని
మోస మౌఁ గద బిడ్డలో దోస మేమొ!
పెద్దవారికిఁ జూపింప భీతి తొలఁగు. 45

చ. అన విని గుండె జల్లు మన
నాటవికోత్తమురాణి మున్ను దా
ననుకొనుచున్న దే యువిద
లందఱు వాకొన భీతచిత్తయై
కనుఁగొను చట్టులే నిలిచెఁ
గన్నుల నశ్రులు నిండఁ; గూరుముల్
ఘనతర పాపశంకలకుఁ
గారణముల్ గద మానవాళికిన్! 46

చ. తడ వటు లుండి యిట్టు లనుఁ
దామరసాక్షి "యి దేమి కర్మమో!
పడుచు విధంబు నెల్ల బహు
భంగులఁ దెల్పుదుఁ బూఁటఁ బూఁట మా

యొడయని, కాతఁ డన్నిట్టివాని
యూఁకొను, నంతియకాని బిడ్డ కీ
యిడుమ దొలంగు నవ్వెరవు
లెవ్వియుఁ జూడఁ, డిఁ కేమి సేయుదుౝ? 47

ఉ. కూఁతు పరిస్థితిం దలఁచి
కుందుదునా? యొడయండు మిన్న కే
జాతరనాఁటినుండి తన
సాజపురూపుఁ దొలంగి యెద్దియో
భూతము పట్టిన ట్లునికిఁ
బూనుటకుౝ విలపింతునా? యిసీ!
నా తలవ్రాఁత యింతయు మ
నం బెరియింపక రిత్తవోవునే? 48

ఆ. అనుచుఁ జెప్పి తల్లి యాక్రోశపడఁ జూచి
యశ్రుజలము పైఁట నద్దుకొంచుఁ
దాపసులకుఁ జూపి తామెత్తుఁ గట్టింపు
మనుచుఁ జెప్పి పోయి రతివ లెల్ల. 49

ఇది కాళీమందిరము

# తపశ్చరణము



సీ. నర్మద నిజవీచినవ్యహస్తస్పర్శ
నియమాభిషేకంబు నిర్వహింపఁ
బ్రత్యహంబును భూర్జపాదపనికరంబు
సాంద్రవల్కలశాటి సంఘటింప
నీహారబిందుతుందిలవాతపోతముల్
వేదిసమ్మార్జనవిధుల నెఱపఁ
గుతపకాలములందుఁ గూర్మిమై వనరాజి
సహకారఫలభిక్ష సంతరింపఁ

తే. దన్నుఁ దనలోనఁ గన్గొంచు నన్ని మఱచి
తపము గావించె నా వింధ్యవిపినభూమి
భరతభూజనసౌఖ్యసంపాదనేచ్ఛ
గాత్రపరిశోషి యా బాలయాత్రికుండు. 1

చ. తరులు సుమంబులన్ ఫలవి
తానములన్ విలసిల్లె; వింధ్యని
ర్ఝరులు సుధాంబుపూరముల
స్వచ్ఛత రాజిలె; నిత్యమున్ వనే
చరులు దయార్ద్రభావముల
జంతులకున్ సుముఖాత్ములైరి; యా
తరుణతపస్వి యచ్చటఁ బ
దం బిడినప్పటినుండి కానలన్. 2

ఉ. పూపబెడంగుఁ బ్రాయమున
పూర్వతపశ్చరణంబుఁ జూడ్కికిన్
దీపగు రూపసంపద మ
దిన్ దలపోసి పుళిందభామినుల్
"పాపము! వీని ని ట్లడవి
పా లొనరించిన దైవ మెంతి చూ
పోపని" దంచుఁ జెప్పికొను
చుందురు నిత్యము బోయవాడలన్. 3

ఉ. తా మనుకొన్న కార్యములు
తప్పక నెగ్గునో, బిడ్డపాపలం
దేమియు ముప్పు వాటిలదో,
యెట్టిదో వారితలంపు! బోయలే
జామున నైనఁ దీఱికగ
సాఁగిలి వచ్చెద రొక్కసారియేన్
బ్రేమ దలిర్ప నా యతికిఁ
బిన్నలు పెద్దలుఁ బ్రత్యహంబునన్ 4

ఉ. సాగిలి మ్రొక్కి గోరజము
సంకుమదంబును జుంటితేనియల్
మాఁగిన వెల్లపండ్లు నతి
మార్దవ మొప్పు మృగాజినంబు ల

త్యాగికిఁ గాన్కగా నిడుదు
రాటవికుల్ "దమ కిష్ట మిష్టమే
కాఁగల దెల్లవారి" కని
కల్గుట సాజము భూజనాళికిన్. 5

చ. అలసత సర్వభూతతతి
యక్షియుగంబు మొగుడ్చుచో సుధీ
కలితుఁ డతండు మేలుకొని
కన్గొనుచుండు; సమస్తసత్త్వముల్
మెలఁకువఁ గాంచుచో నయన
మీలనముం బొనరించు నాతఁ; డ
య్యలఘుతపోవిభూతి సక
లాధివిఘాతి సమాశ్రితాళికిన్. 6

చ. పొలుపుగ మాఱుమూల విరఁ
బూచిన వృక్షము తావి దిక్కులం
దలమినరీతి నా యతికు
లాగ్రణి కీర్తి వెలుంగ నాశ్రమం
బులఁ గల మౌను లందఱు ప్ర
మోద మెలర్పఁగ వచ్చి చూతు రా
కలుషవిదూరు శాంతముఖు
గాఢసమాధినిమగ్నచిత్తునిన్. 7

ఉ. వచ్చిన సాధకుం డనుచు
నైకవిధశ్రుతిసిద్ధయోగముల్
మచ్చిక నేర్పఁగోరి మహి
మంబున నొప్పు మునీంద్రు లెందఱో
వచ్చియు నాత్మనిష్ఠ విడి
భాసురమూర్తి యతండు కన్గనన్
విచ్చినయంతఁ జెంతఁ బృథి
విం బడి మ్రొక్కుదు రేమి చిత్రమో! 8

చ. "అడుగఁగఁ గోర్కి కల్గెను ద
యామయ! మీ తలిదండ్రు లెవ్వ? రీ
పుడమిని మీ నివాసమునఁ
బూజ్యతఁ గాంచిన దేశ మెద్ది? యీ
యడవిఁ దపంబునన్ గల మ
హాఫల మెయ్యది? మాకుఁ దెల్పుఁ" డం
చడుగ ర దేమి యద్భుతమొ!
యాతనిఁ జూచిన వారు లెవ్వరున్. 9

ఉ. చూచినతోడనే యెపుడొ
చూచినయట్లు, నిజాప్తబంధువై
గాచినయట్లు, మీఁదఁ దమ
కష్టములన్ మన సిచ్చి తెల్పినన్

బ్రోచువిధంబు, నందఱను
బ్రోవఁగఁ జాలిన దివ్యతేజమున్
దోఁచుచునుండ నెట్లడుగఁ
దోఁచును? దన్ముని పుట్టుపూర్వముల్. 10

ఉ. కాలపయోదధారలకుఁ
గంపిలె ధాత్రి, సుధాకరప్రభా
జాలపయప్రవాహము ల
జాండము నిండెఁ, దుషారపూరపున్
మేలిముసుంగులోఁ దళుకు
మించె, వనేందిర యంతకంత కా
బాలతపస్విసంయమము
భాసిలె నొక్కటె నిర్వికారమై. 11

ఇది తపశ్చరణము

——/o/——

# అన్వేషణము

ఆ. వనచరేంద్రుతనయ వనతతి నొక్కచో
నాత్మశాంతి యొసఁగునట్టి వ్రతము
నాఫలోదయముగ నాచరింపఁగఁ బూని
తండ్రి కెఱుకపఱచెఁ దనదుకోర్కి. 1

చ. తన సఖితో బయల్వెడలి
తామరసేక్షణ కాంచె వేడ్కఁ బా
వనవనభూమి మానిజన
వాటికలన్ ఘనసాంధ్యరాగసం
జనకకుజావలంబియతి
శాటికలన్ వరకీరకంఠశో
భినిగమసూక్తిరత్నదృఢ
పేటికలన్ శబరేంద్రుసమ్మతిన్. 2

చ. కులపతులన్ మహామహులఁ
గోమలి గాంచెఁ, దదీయవాక్సుధా
కలితహితోపదేశ మతి
గౌరవపూర్వక మాదరించె, న
య్యలికులవేణి నెమ్మదికి
హాయి కనంబడకుంట నెయ్యెడన్
నిలువక యేఁగెఁ; గాంగఝరి
నిల్చునె యంబుధిఁ జేరునంతకున్? 3

చ. అరుదుగఁ జెంచెతల్ రుచిర
హాసిని! నీ వెట కేఁగుచుంటి? వీ
పరిసరభూమి నీ కనుఁగు
బందుగు లెవ్వ? రనంగ సిగ్గునన్
సురుచిరహాసచంద్రికలు
శోభిలు మో మరవాంచి మిన్న కే
వరసఖిమాటున న్నడచె
వారిజలోచన మెల్ల మెల్లఁగన్. 4

చ. తరుణతపస్విఁ గన్గొనిన
తాపసు లా యెలనాఁగఁ గాంచి యా
తరుణుఁడు తోడనే మదికిఁ
దాఁకిన సంతస ముల్లసిల్ల వా
రిరువుర నొక్కచోఁ గనఁగ
నిచ్చ వహించెద; రట్లయాను, సుం
దరతరవస్తుసంగతి ము
దం బొదవించును గాదె చూడ్కికిన్! 5

క. ఎదురైన పథికయువకులు
మది రేకణఁ జూచి యేమొ మాటాడంగా
మదిఁ బూనియు మఱతురు త
ద్వదనేందుద్యుతులు దవిలి వదలని చూడ్కిన్ 6

చ. చని చని కాంచె రాజముఖి
సంయమిదర్శనమాత్ర భక్తిసం
జననము భూతలప్రణత
శాబరపూరుష బాలబాలికా
ఘనము దిదృక్షుమానికృత
గాఢసముత్సుకతావిశేషవం
దనము ప్రశాంత మా తరుణ
తాపసవాసముఁ జిద్విలాసమున్. 7

చ. గిరితటనిర్ఝరోత్పతన
కీర్ణజలాంతరభానుదీప్తిభా
స్వర మరుణప్రవాళమృదు
శాటిరసాలయతీంద్రమండితాం
తర మురుసామగానపర
తంత్రశుకీరవబద్ధవన్యసిం
ధురము విమూఢమానవవి
దూరము రమ్యమృగీప్రచారమున్. 8

ఆ. పూయ నున్నయవియుఁ బుష్పించినవియును
దొట్టతొలుత మొగ్గఁ దొడుగునవియు
ఫలభరంబుకతన నలసంబులును నైన
లతల సఖులయట్టు లతివ కాంచె. 9

ఉ. అంతఁ బుళిందరాజసుత
యాప్తసఖిం దిలకించి పల్కె "నా
స్వాంత మిదేలొకో మధుర
భావవికస్వర మయ్యె నిందు, నీ
ప్రాంతవనాంతశోభ హృద
యంగమమై విలసిల్లెఁ జూచితే!
యెంతగఁ జూచినన్ గనుల
కెప్పటి కప్పుడె క్రొత్తక్రొత్తగన్, 10

ఉ. నవ్వులు గావు నా మదికి
నచ్చవు తొల్లిటి వన్ని యెన్నియే,
నివ్వని మందమారుతము
లిందుశిలాతటి నిర్ఝరావళుల్
దవ్వుగఁ జోపె నా హృదయ
దైన్యము నెల్ల, వసింతు నియ్యెడన్
నెవ్వగఁ గుందరేని జన
నీజనకుల్ ననుఁ బాసి యాదటన్. 11

ఉ. ఇందుఁ దపంబుఁ జేయునతఁ
డెంత మహాత్ముఁడో! కాకయున్న నీ
చందమునన్ గపివ్రజము
సాలలతాపరిపోషణక్రియా

నందముతోడ నిల్లెసఁగు
నా! తమ చేష్టలు మాని, దీనికిన్
సందియ మేల? నా మనసె
చక్కని సాక్ష్యము చెప్పుచుండఁగన్. 12

చ. అన విని పల్కె నెచ్చెలి "సు
ధాంశుముఖీ! నిజ మింత; యెన్నఁడేన్
గనఁబడ వీయపూర్వశుభ
B V.K
కాంతులు హర్షము నీదు మోమునన్,
మును పొకసారి యేటిదరి
మోహనమూర్తి మహాత్ము నొక్కనిన్
గనుఁగొనినప్పు డీ చెలువుఁ
గాంచితి, దీనికి సాక్ష్య మేటికిన్? 13

క. పొలఁతు లిటు మాటలాడుచు
జలజల ప్రవహించు నేటిజాలున నెమ్మో
ము లలరఁగ సేద దేఱిరి
పొలపొల వికసించు మల్లెపువ్వులువోలెన్. 14

సీ. గమనశ్రమంబుచేఁ గదలి యిట్టటులైన
స్తనవల్కలము తీరుఁ జక్కఁ జేసి
యంసద్వయీసీమ నట్టిట్టు చలియించు
కీలుగంటున మల్లెపూలు దుఱిమి

వా తెఱనిగ్గుతో వాదాడ నుంకించు
తిలకమ్ముతిలకంబుఁ దీర్చి దిద్ది
తెలిగన్నుఁగవకాంతిఁ గలిసి జాల్వాఱెడు
దంతచంద్రికహారకాంతి నించి

తే. గరువతనమును నెయ్యంబు నారసికొనఁగ
మేను పులకింపఁ గుతుకంబు మిన్ను ముట్టఁ
జెలియ లల్లన నడచిరి చెట్టవట్టి
తరుణతాపసు నాశ్రమస్థానమునకు. 15

ఉ. నిండుసమాధిలో మునిఁగి
నిశ్చలదృష్టి ముఖేందుదీప్తులన్
నిండిన పాటలాధరపు
నిగ్గు పయిన్ బ్రసరింప, వేదిపై
నుండిన శాంతమూర్తి వికచోత్పలనేత్రలు గాంచి రంత నా
ఖండలధైర్యహారిఁ దను
కాంతిజితస్మరు బాలతాపసున్. 16

క. మెల్లనఁ బుష్పాంజలులన్
జల్లిరి యువమౌనిపాదసారససీమన్
బల్లవపాణులు కన్నవ
తలడ మందంగఁ గౌను తహతహపడఁగన్. 17

మ. భయభక్తుల్ మెయితీవకున్
జలన మాపాదింపఁ, జిత్తంబు ప్రే
మయమై యెట్టిటో కాఁగ, స్వీయగుణాస
మ్నానంబు వెన్ జూపఁగా,
దయనీయస్థితి గోచరింప, వికస
త్పద్మాక్షు లా మానికిన్
నియమం బొప్ప నమస్కరించిరి చల
న్నీలాలకశ్రేణితోన్. 18

ఉ. ముంగురు లల్లనన్ ధరణి
మోవఁగ మ్రొక్కి విలోలమంజులా
పాంగరుచిప్రసారములు
బాలయతీంద్రునిమీఁదఁ బర్వ నా
చెంగట నోరగా నిలిచె
శీతకరాస్య సఖీసమేతయై
బంగరుమేని కాంతులకుఁ
బాదపముల్ సుమసౌరభం బిడన్. 19

ఆ. అంతు పొంతు లేని యంధకారము దాఁటి
నిండువెలుఁగుఁ గూడి యుండుకతనఁ
దాపసోత్తముండు తా నొక్క తెలుఁగఁడు
ముదిత వచ్చుటయును మ్రొక్కుటయును. 20

ఆ. ప్రొద్దు వాటువాలె, భూరుహచ్ఛాయలు
వారి విడిచి తూర్పుదారిఁ బట్టె;
నట్టె నిలిచి చూచు నటవీంద్రసుతఁ గాంచి
చెలియ వలికె నిట్లు చెవికిఁ జేరి. 21

చ. వనరుహనేత్ర! తమ్ముఁ గన
వచ్చిన సాధులఁ గాంచి సన్మునుల్
మునుకొని క్షేమ మారసి ప్ర
మోదమునన్ దమ కున్నయంతలో
ఘనమొ యొకింతయో యొసఁగి
కాంక్షితముల్ నెఱవేర్తు; రీక్రియన్
గనికర మింత లేని మునిఁ
గన్గొనియుంటిమె యెన్నఁడేనియున్? 22

చ. ఇటు తనుఁ జూచుకోర్కెమెయి
నింతటి దవ్వున కోర్చి రాఁగ న
క్కటిక మొకింత లేదు, మఱి
గౌరవపుంబలుకైన సున్న, యిం
తట మన కానకుం బోధము,
తల్లియు నింతకు నెంత కుందునో!
కటకట! యెంతసేపిటులు
కాళ్లివి రాళ్లుగ నిల్వఁగావలెన్? 23

ఉ. అచ్చెరు వయ్యె నీతబిసి
యాగడముఁ గనుఁగొన్నఁ, జెంతకుఁ
వచ్చి వినీతిమై మనము
పాదతటిఁ బ్రణమిల్లు సుంత కఁ
విచ్చి కనంచు, రమ్మనఁడు,
వీనుల కింపుగఁ బల్కఁడుఁ, జింతయుఁ
హెచ్చని యెంచెనో తన
యహీనతపశ్చరణప్రతిష్ఠకుఁ! 24

ఆ. వేచి వేచి మదికి వికలత వాటిల్లె,
నుండి యుండి మేను బెండువడియె,
రేపు చూడవచ్చుఁ దాపసోత్తము, రమ్మ
తండ్రి కోపగించుఁ, దల్లి కుందు. 25

క. సకి యిట్టు లనిన మాటకు
వికచోత్పలనేత్ర పలికె విస్మితముఖయై
"యకలంకతపోనిరతుల
నకటా! మన మిట్టు లాడ నగునే? చెలియా! 26

మ. తల్లిం దండ్రినిఁ బాసి కాఱడవిలోఁ
దానొంటిమై దీక్షతో
నుల్లోకప్రతిభావిశేషమున భే
దోన్మేష సంపూర్తిగా

నుల్లంఘించిన సత్త్వరూపునకు నీ
యుల్లాసముల్ సత్కృతుల్
చెల్లన్ నేర్చునె? యింతయున్ దెలియ వి
స్సీ! యేమనందున్ సఖీ! 27

క. నామటుకు నాకు నీ ముని
సామీప్యమె చాలు, వేఱె సత్కృతు లేలా?
యే మహిమయొ కాని యిటన్
యామంబులు క్షణము లయ్యె నంబుజవదనా! 28

మ. కలలోఁ గాంచిన సన్నిధాన మనఁగాఁ
గన్పట్టు నీ మౌని క్రే
వల నుండన్ దృణభోజనంబును సుధా
ప్రాయంబు నా, కింక నా
తలిదండ్రుల్ ముద మందనీ, వగవనీ,
తా మొక్కలై బంధుగుల్
వెలివెట్టన్ దలపెట్టనీ, యలవియే
వీడంగ నీ తాపసున్? 29

క. నెచ్చెలు లన్నన్ బ్రాణము
లిచ్చెడి శబరేంద్రుపుత్రి యిటు వల్కఁగ, లో
నచ్చెరువు నీసుఁ బెనఁగొన
నచ్చెలి యనె వినయ మనునయంబును దోఁపన్. 30

ఉ. ఇన్ని దినాలనుండి మన
కిద్దఱ కొక్కటై యాత్మ, మేను వే
భిన్నము లౌటఁ బ్రేమ నినుఁ
బెంచిన వార లహర్నిశంబు నిన్
మన్ననఁ గాంచు రీతియు సు
మప్రభ! నీ విటు మండు టెండలోఁ
జెన్నుఁ దొఱంగి నిల్చుటయుఁ
జిత్తము నుత్తలపెట్టె మానినీ! 31

ఆ. అంతె కాని మాని నవమానపఱచిన
పల్కు కాదు కాళిపాదమాన
చిన్ననాటి చెలిమి చేనంటి నింతలో
నిట్టు పల్కు దంచు నెఱుఁగనైతి. 32

క. వనజాక్షీ యిపుడు నే నీ
మన సెఱిఁగితిఁ, దప్పు నాదె, మన్నింపఁ దగున్
మును పున్న చెవులకన్నన్
వెనుకటి కొమ్ములవి వాఁడి వింతయె? చెపుమా! 33

చ. కనుఁగొన లెఱ్ఱనై మొగము
కందిన నెచ్చెలి వైపు చూచి యా
వనచరరాజపుత్రిక
యపారకృపామతి "నీదు భావమున్

గనుగొన నిట్టు లంకి'' నని
కౌఁగిటఁ జేర్చి వయస్య నెట్టెటో,
వనరుహానేత్ర లాతబిసి
వాటిక వీడిరి మెల్లమెల్లనన్.

ఇది అన్వేషణము.

# సపర్య

చ. అళికులగీతముల్ హృదయ
హారిశిఖావళనాట్య మింపులన్
జిలుకు ఝరీనినాదములు
స్నిగ్ధశిలాతటి రంగవల్లికల్
కలిగి ప్రభాతవేళఁ గన
కద్యుతిఁ బొల్చిన సాంధ్యదీధితిన్
గలకలలాడె నాశ్రమము
కన్నియ పాదము మెట్టినంతటన్.

సీ. నలినాక్షి నర్మదానదిఁ గ్రుంకి వేకువ
నలయక యభిషేకజలముఁ దెచ్చు
వినయభూషణ వృక్షవేది సమ్మార్జించి
పుష్పాళిన్ ముగ్గు లిం పొప్పఁ దీర్చుఁ
బద్మపేశల పాణిపద్మముల్ కసుగందఁ
గూర్మి సమిత్కుశల్ కూర్చి తెచ్చుఁ
బుష్పకోమల దేవపూజాసుమంబులు
తేఁటు లంటకమున్న తెచ్చి యుంచు

తే. మధురఫలముల నేర్చి సన్నిధి నమర్చి
సంయమీంద్రుని దృష్టిప్రసారమునకు
వినతయై పెద్దయుంబ్రొద్దు వేచియుండు
వ్యాధరాట్పుత్రి నిత్యసేవావిధాత్రి.

ఉ. రోజుకు రోజుకున్ వెలఁది
రూపము భావము క్రొత్తక్రొత్తలై
రాజిలఁ జూచి తల్లి మది
రంజిలెఁ, జెంచెత లెల్లఁ గాంతివి
భ్రాజితరాజపుత్రిక న
పారముదంబునఁ గాంచి, రా వనీ
భూజను లెల్ల భక్తి ముని
ముఖ్యునకున్ గయిమోడ్చి రెల్లెడన్. 3

ఉ. తా మును గన్న యాత్రికుఁడె
తాపసుఁ డౌట నెఱింగినప్పు డా
భామిని భక్తియున్ వినయ
భావము హెచ్చెను, గాని యెన్నఁడే
నా మునిపుంగవుండు నయ
నాబ్జము లల్లన విచ్చు వేళకున్
గోమలి పుష్పమండితని
కుంజముమాటున కేఁగు మెలనన్. 4

చ. తన పను లెల్లఁ జూచుకొని
తామరసాక్షి మునీంద్రు నెమ్మొగం
బును గనుఁగొన్నమాత్ర శ్రమ
వోవ నవోల్లసదాననాబ్జయై

మునుకొని తా నదీజలముఁ
బోసి ప్రియంబుగఁ బెంప నిత్యమా
తనరుచిఁ బొల్చు నా తరుల
తల్ గనుఁ గన్నులకర్వు దీఱగన్ 5

చ. జలధర వేణి ముందట ర
సాలతరుల్ సుమపల్లవప్రభన్
ఫలభరనమ్రశీర్షముల
వ్రాలుచు మాతృపదాభివందనం
బులు సలుపంగ మిన్నక ప్ర
మోదపుటశ్రులు నించు; వింతయే
తలఁపులు మీఱు సంతసము
తల్లికి బిడ్డలు మ్రొక్కు వేళలన్? 6

ఉ. ఎప్పటియట్ల యెప్పుడో య
తీంద్రుఁడు తాను సమాధి వీడినన్
దప్పఁ గనుంగొనంగ విత
థస్థితి భాసిలు బాహ్యలోక, మా
యొప్పులకుప్పయున్ నిలువ
నొల్లదు తన్మునిదృక్పథాన, నిం
కెప్పుడు కల్గు నొండొరుల
కీ క్షణసంగతి మానసైక్యమున్? 7

ఆ. యోగనిద్ర వీడి యోగీంద్రుఁ డా యేట
స్నానసంధ్య లెపుడో సలిపి వచ్చి
దేవదారుతరువుతిన్నెపై వసియించు
సకియ మోముఁదమ్మి సంకుచింప. 8

ఉ. బాలిక తాను జేసెడి స
పర్య యతీంద్రుఁడు మెచ్చుమాత్రకున్
జాల దటంచు నెంతయుఁ బ్ర
శాంతముతోడఁ దదీయసేవలన్
దేలుచుఁ జెంతఁ బుష్పసము
దీర్ణ లతాకలనాసుఖాసికా
లీలలఁ దేలు నా యువమి
ళిందములన్ గను నిర్నిమేషయై. 9

చ. మసలక కాల మేఁగె మధు
మత్తమిళిందము చండభాస్కర
ప్రసరము నీలనీరదన
భఃపరిణాహము సాంద్రచంద్రికో
ల్లసితసమస్తలోక ముప
లాలితహవ్యవహప్రతాపమున్
వసనదరిద్రసజ్జనవి
భాసివిపర్ణమహామహీజమున్. 10

చ. యతిపతి యొక్కనాఁడు తన
 యాత్మసమాధిని వీడి లోకసం
గతమతి నున్నపోల్కిఁ గని
 కన్నియ మన్నన మీఱ స్వీయసం
తతపరిచర్య నేఁటికిఁ గ
 దా! యుదయోన్ముఖ మయ్యె నంచు న
ద్భుతగతి నేఁగె నర్మద క
 హర్పతి తూర్పునఁ దోఁపకుండఁగన్. 11

చ. గురువరుసత్కృపామహిమఁ
 గుంభజపాదరజఃప్రపూతభూ
ధరతటి సార్థవత్సర ము
 దారతపశ్చరణంబు విఘ్నముల్
పొరయక సాగె నీ భరత
 భూజనసౌఖ్యసమృద్ధి కంచు నా
తరుణతపస్వి తా మది ము
 దంబునఁ బొంగుచు నుండు నత్తఱిన్. 12

చ. పశుబలగర్వసంతమస
 బంధురమైన జగాన స్వార్థ మన్
పిశితపుటాసతోడ నిఱు
 పేదలఁ బట్టు దురాత్మభూతపున్

విసరము పశ్చిమాశ కతి
భీతిమెయిన్ బరువెత్తఁ దూర్పునన్
హసితదిశావధూముఖుఁ డ
హర్పతి తోఁచె నవోదయద్యుతిన్. 13

చ. అరుణకరప్రసారమున
నాశ్రమభూమిఁ బుళిందరాట్సుతా
విరచితరంగవల్లు లట
వీచరదత్తవిచిత్రవస్తువుల్
పరమయతీంద్రు నెమ్మదికి
భాసిలె నయ్యెడఁ గ్రొత్తక్రొత్తలై
గురుతరకార్యమగ్నుల క
గోచరముల్ గద లాఁతివస్తువుల్. 14

క. మనదేనా యీ యాశ్రమ?
మని యాశ్చర్యంబు నొంది యాదిత్యుదెసన్
గని ప్రొద్దెక్కె నటంచున్
జనె నాతఁడు తాన మాడ సత్వరగతియై. 15

సీ. నర్మదాజలధౌతనిర్మలాననసీమఁ
జిన్నారిముంగురుల్ చెన్ను తొలఁకఁ
దడిసి మైనంటిన స్తనవల్కలపుటంచు
దారివెంబడి తోయధార లొలుక

గలశభారంబుచేఁ జలియించు నెఱికొను
తతనితంబమునందు ధృతిఁ జెలంగఁ
దడఁబడ నిసుకలో నడఁగు నడుగులపై
వాలుఁజూపులసొరు జాలువాఱ

తే. మనసు పరువిడ, గమనంబు మందగింప,
నలఁతియూర్పుల నభిషేకజలముఁ దెచ్చు
తరళలోచనఁ గాంచె నా తాపసుండు
జలక మాడంగఁ జని నదీపులినతటిని. 16

చ. కుతుకమొ! విస్మయంబొ! మఱి
కూరిమియో! మునినాథుచూడ్కి సం
తతనియమప్రయాసమున
దప్పిఁ గలంగెనొ! నాఁగ వ్యాథరా
ట్సుతవదనేందుచంద్రికలఁ
జూఱఁ గొనెన్ క్షణమాత్రలోన; నూ
ర్జితరమణీయమూర్తులు హ
రింపవె లోకవిలోకనంబులన్? 17

ఆ. ఎదురువచ్చు మౌని కదియరా మున్నుందె
తోయజాక్షి దారిఁ దొలఁగి నడచె
బాలయతియు నెపుడొ భామిని నెమ్మోముఁ
గనిన చాయఁ దోఁపఁ గళవళించె. 18

ఉ. ఎన్నఁడునేని నెమ్మదికి
నీ యనుభూతి నెఱుంగనట్టి యా
పిన్నతపస్వి తొల్దొలుత
బింకముఁ బూనెను గాని తోడనే
కన్నియనెన్నడల్ దవిలి
కన్గవ పాఱ మరల్పలేఁ డహో!
క్రొన్ననవిల్తు విక్రమ మ
కుంఠిత మౌ నన నిట్టిదే కదా! 19

ఉ. మున్నొకసారి యేటిదరి
మోహనగాత్రిఁ బుళిందరాట్సుతన్
గన్నపు డిట్టులే మది వి
కారము గల్గ నడంచె నాతఁ; డా
విన్ననువుల్ గుణాగుణవి
వేచన మిప్పుడు సాగిరావుగా!
అన్నిదినంబులున్ దనవి
యౌనె త్రిలోచనునంతవానికిన్? 20

ఉ. ఎవ్వరి కన్యయో! అడవి
నేల వసించునో! యీ వ్రతంబుఁ దా
నెవ్వని నెయ్యముం దలఁచి
యేకత మిట్లు సమాచరించునో!

‘‘మవ్వపుఁగాంచనా[illegible]
మౌక్తికముఁల్ పనడంబు లేకమై
జవ్వని యయ్యెనో!’’ యనుచు
సంయమి యచ్చెరు వొందు మాటికిన్. 21

క. యువతులఁ జూచుట పల్కుట
యవినీతికి దారిఁ దీయు ననుకొనియును గా
రవ మొప్ప నా శుభానన
నవమధురాకృతినిఁ దలఁచి నలుగడ లరయున్. 22

చ. నిరుపమమున్ గభీరము వి
నిర్మలమున్ బరిపూర్ణసాగరాం
బరములఁ బోలు నా పరమ
పావను మానస మిందుసుందరీ
స్ఫురణము సోఁకఁ దల్లడిలె,
శూన్యత నొందె, నలంగె దీనతన్,
దరుణవయఃప్రదోష మిది,
తాపసు దూఱఁగఁ బాపమే కదా! 23

క. తన యాశ్రమంబె డగ్గఱ
వనితన్ దూరానఁ గాంచి స్వారాజ్యఘనా
వనసమ్మద ముప్పతిలన్
ముని యెట్టటో స్నానవిధిని ముగియించి చనెన్. 24

ఇది సపర

# సమాగమము



ఆ. చెలువ యాశ్రమంబుఁ జేరి యెప్పటియట్టు
లార్ద్రవల్కలంబు లాఱవైచి
పూజఁ జేసికొంచుఁ బొదరింటఁ గూర్చుండెఁ
దరుణమౌని యటకు మఱలుసరికి. 1

చ. కలికి కనంగరామి యతి
కన్గవ కింపులు నింప వాశ్రమ
స్థలగతపూర్ణకుంభములు
సాలలతాపరిలంబితంబులౌ
వలిపపుటార్ద్రవల్కములు
పాదపవేదివికీర్ణపుష్పముల్
జిలిబిలిముగ్గులుల్ సురభి
శీతలముల్ కలయంపిరేకలుల్. 2

ఉ. ఇన్నిదినాలనుండి విసు
వింతయు లేక సపర్యదీక్షఁ గై
కొన్నది నేనటుల్ గనిన
కోమలియే యగునా? యదైన నా
కన్నియ యేలొకో యిచటఁ
గన్పడ, దింతకుఁ జూచి చూచి నా
యున్నపరిస్థితిం దలఁచి
మోహిమి వీడి నిరాశ నేఁగెనో! 3

ఉ. పూతచరిత్ర రమ్యగుణ
భూషణ బాలిక యోర్తు నాతపః
ఖ్యాతిని నమ్మి భక్తిఁ జిర
కాలసపర్య నలంగి నిర్జన
స్ఫీతవనాంతసీమ విక,
సించిన పుష్పములీల వ్రాల ని
శ్చేతనవృత్తి నుంటినె! యి
సీ! యిఁక నాదు తపం బదేటికిన్? 4

చ. తరుణి మదర్థమై కఱకు
దర్భలు గోసి క్షతాంగుళీకమౌ
కరము హిమాంబుశీతలసు
ఖప్రదమైన సమీపశైలని
ర్ఝరజలధారలందు నిడి
సారెకుఁ గన్గొన కున్నె నన్ను దు
ర్భరతర వేదనాశ్రుజల
బంధురపక్ష్మవిలోకనంబులన్? 5

తే. అనుచుఁ బరిపరివిధముల యతివరుండు
తరుణి పెంచిన సహకారతరులఁ గాంచి
లలన సాఁకిన మాధవీలతలఁ జేరి
వికలమతి నచ్చటచ్చట వెదకఁ బూనె. 6

క. పొదరింట నొదిఁగి కనుఁగొను
మదిరేక్షణ హావభావమాధురిగరిమన్
హృదయంబు పొంగి పొరలఁగఁ
గదలక యానందబాష్పకణములు నించెన్. 7

మ. “తన యాజ్ఞన్ శిరసావహించి వినయో
దారుండు శిష్యుండు తాఁ
జనియెన్ వింధ్యమహాటవిన్ ఘనతప
శ్చర్యార్థమై యెన్నఁడో,
వినరాదాయెఁ దదీయవార్త” యనుచున్
వీక్షింప నేతెంచె నా
తని విద్యాగురు వాశ్రమస్థలికి వా
త్సల్యంబు నిండారఁగన్. 8

క. అనుకొనకుండఁగ నెదుటన్
గనుపట్టిన గురుని పాదకమలంబులకున్
వినయంబు లజ్జ విస్మయ
మును బెనఁగొన మ్రొక్కె బాలమునివరుఁ డంతన్. 9

చ. గురుఁడు నిజాంఘ్రిపద్మముల
కున్ బ్రణమిల్లిన శిష్యు నల్లనన్
గరములఁ బట్టి యెత్తి తన
కౌఁగిటఁ జేర్చఁగఁ, జూచి యావనే

చరపతి పుత్రియున్ గుతుక
సాధ్వసముల్ పెనఁగొన్నచూడ్కి నా
తరుణతపస్విదేశికు ప
దద్వయి వ్రాలె వినీతవృత్తిమైన్. 10

ఉ. నీరదపంక్తి వీడి ధర
ణీస్థలి నిశ్చలవృత్తి నిల్వఁగాఁ
గోరిన మించు నా సుమని
కుంజము నల్లన వీడి చెంతకున్
జేరిన తన్విఁ గాంచి గురు
శేఖరుఁ డప్పుడు హర్షవిస్మయో
దారతఁ జూడ్కి నా తరుణ
తాపసుదిక్కు మఱల్చునంతలోన్. 11

శా. ఇల్లయ్యెన్ మునిపల్లె కూఁతున కయో!
యెందైన నీ చెయ్దముల్
చెల్లన్ నేర్చునె బోయజాతి? కిఁక మీ
చే నిందపాలైతి మం
చెల్లన్ బోయత లాడ మానివసతుల్
వీక్షించుచున్ వచ్చి రా
తల్లిం దండ్రియుఁ బుత్రిఁ గానని మన
స్తాపంబు దీపింపఁగన్. 12

క. మున్నుగ బోయలరాయని
యన్నువ తన పాదయుగము నంటిన కూఁతుర్
"ఎన్నాళ్లకుఁ జూచితి నిక
గన్నుల నా తల్లి!" యనుచుఁ గౌఁగిటఁ జేర్చెన్. 13

ఉ. ఎన్నఁడో లోకవృత్తముల
కెల్ల జలాంజలి యిచ్చి మౌనియై
యున్న యనుంగుఁదండ్రి మది
నూఱటఁ గానక చూడ వచ్చినన్
అన్నలినాక్షి భీతిమెయి
నంఘ్రియుగంబున వ్రాలె; నాతఁ డా
యన్నులమిన్నఁ జేఁ దిగిచి
యక్కునఁ జేర్చె సబాష్పనేత్రుఁడై. 14

చ. తరుణతపస్వి పాదతటిఁ
దద్గురువర్యపదాంబుజద్వయిన్
నిరుపమభక్తి మ్రొక్కెడు వ
నేచరనాథుఁ గవుంగిలించె నా
వరకరుణామయుండు ముని
వంద్యుఁడు వృద్ధతపస్వి ప్రీతిమై;
నరయరు తారతమ్యము మ
హాత్ములు సాధుసమాగమంబులన్. 15

ఆ. బూచివోలె నున్న బోయతఁ దిలకించి
కుసుమగాత్రి నామెకూఁతుఁ గాంచి
యంజనాద్రి నెనయు నటవీంద్రు వీక్షించి
గురుఁడు పలికె నిట్లు కుతుక మొప్ప. 16

చ. వనచరనాథ! మిమ్ముఁ గన
బంధుల నెల్లరఁ జూచినట్లు నా
మనసు ప్రసన్నతన్ బొదలె,
మంజులగాత్రి సుశీల యీ శుభా B V.K
నన భవదీయపుత్రియె? అ
నారత మిచ్చోటనే వసించునా?
వనితయు నీవు నార్తి నిట
వచ్చుటకున్ గత మేమి? దెల్పుమా! 17

ఉ. శీలవివేకశాంతగుణ
శేవధి సంయమిపుణ్యగేహినీ
లాలితశైశవుండు శుభ
లక్షణుఁ డార్యపథానువర్తి యీ
బాలుఁడు నాదుశిష్యుఁడు త
పఃప్రతిభానిధి వింధ్యశైలభూ
పాలక! వచ్చె నేననుప
భారతభాగ్యవిధానదక్షతన్. 18

ఉ. భారతధాత్రిగాత్రము వి
        భక్తతనొందిననాఁడు వేదనా
పారముఁ గాంచలేక ప్రజ
        పర్వతసీమఁ జొరంగఁబాఱ దో
స్సారమదోద్ధతిన్ గలిసి
        శాబరతస్కరకోటి వారిపైఁ
గ్రూరతఁ జేసినట్టి యల
        ఘోరదురంతము జ్ఞప్తి నున్నదే? 19

ఆ. ఆనాఁడు ప్రొద్దుపొడుపున
స్నానార్థం బేఁగి యొక్కశవదేహముపై
దీనత వాపోయెడు పసి
కూనన్ దూరానఁ గాంచి కుతుకం బొప్పన్. 20

ఆ. చేరఁబోవునంతఁ జిన్నికేల్ పైకెత్తి
"అమ్మ యమ్మ"యంచు నటమటించు
బాలుఁ గాంచి జాలి పట్టఁజాలక యెత్తి
కొంచు బుజ్జగించి కూర్మి మీఱ. 21

ఆ. ఊరు పేరు నడుగ మాఱుమాటాడంగ
నోరు లేని బాలు తీరుఁ జూచి
ప్రేమ మీఱఁ దెచ్చి పెంపఁగ నీతండు
వేదశాస్త్రతత్త్వవేత్త యయ్యె. 22

ఉ. బాలుని తేజముఁ మధుర
భాషణముఁ శుభలక్షణంబులుఁ
శీలముఁ బోలఁ జూచి యొక
సిద్ధుఁడు వాకొనె "స్వార్థలుబ్ధ భూ
పాలకపాలనాచకిత
భారతమాత యఖండవైభవో
న్మీలన మొందు నీతని య
మేయతపోవిభవానుభూతులఁ. 23

చ. గురుకులవాసముఁ గడపి
కుంభజపాదరజఃప్రపూతభూ
ధరతటి సార్థవత్సర ము
దారతపం బొనరించి యంత యీ
తరుణుఁడు గేహియై నయవి
ధాతకు భారతధాత్రి నేతకుఁ
గురుఁడగు సాధుబృందముల
కుఁ బ్రమదంబుగ" నంచుఁ దెల్పెనఁ. 24

ఉ. సంతస మొప్ప సన్మను లొ
సంగెడు దీవన లంది వీఁడు ని
శ్చింతగ వచ్చి వ్యాఘ్రమద
సింధురబంధురమైన కోన నే

కాంతమునన్ వసించెఁ, జిర
కాలము వార్తయు లేక నామదిన్
వంత క్షణక్షణంబు బల
వంతముగా నిటు వచ్చితిన్ జుమీ. 25

చ. అన విని పల్కె నావనచ
రాగ్రణి "ఓ మునిచంద్ర! మీరు వా
కొనినది యెల్ల నాయనుఁగుఁ
గూఁతు చరిత్రమె! అల్లనాఁడు త
ద్వనితటి నొక్కచోటఁ బసి
పాప కనంబడెఁ బాముకాటునన్
జనని గతింపఁగా శవము
సందిట బాలశశాంకరేఖ నాన్. 26

ఆ. శబరభటులు దాని జాలిమైఁ గొని వచ్చి
చెంత నిడఁగఁ జూచి సంతులేమిఁ
దల్లడిల్లు నాదు నిల్లాలి కిచ్చితిఁ
బ్రేమ మీఱఁ బెంపఁ బెరిఁగె నీమె. 27

ఉ. "చేసిన పాపముల్ తొలఁగుఁ
జెప్పినచో" నని యంద్రు, నాఁడు నే
జేసినవే కదా! పథిక
చిత్రవధల్, మితి మీఱి యీ తపో

భాసుర భూసురప్రవరుఁ
బట్టితినే బలిపెట్టఁ గాళికిన్
దేశికవర్య! నా యఘము
తీఱునె జన్మశతాల కేనియున్? 28

ఉ. శ్రీల నెసంగు నీ యువకు
స్మేరముఖాబ్జముఁ గాంచినంత నా
కేలొకో ప్రాణిహింస యన
నేవ జనించె, నసత్య మాడఁగా
నాలుక రాదు, పాఱదు ధ
నంబులపై మది, కాని చూడ్కి కీ
బాలిక దూర మైనయెడఁ
బ్రాణము నిల్వదు తాపసోత్తమా! 29

ఉ. తామసవృత్తి యీ మునిసు
ధాకరు దర్శన మబ్బినంతనే
తా మసి య య్యె; విశ్వము సు
ధామధురాకృతిఁ దోఁచె, బుత్రిపైఁ
బ్రేముడి యెక్కుఁడే ననుఁ బో
రింబొరి బద్ధునిఁ జేయు, నద్దియున్
నా మది వీడిపోయె ముని
నాథ! మిమున్ గనినంత నిచ్చెడన్. 30

ఉ. విన్నప మాలకింపుము వి
వేకనిధీ! ఋణపడ్డవాఁడ నీ
కిన్నతపస్వి కేను, నిజ
పేదకు నాకిది తీర్ప నౌనె? నా
పెన్నిధిఁ బ్రాణజీవనముఁ
బ్రేమమయిన్ సుమగాత్రిఁ బుత్రి మీ
సన్నిధి నిత్తు నీ శబర
సౌఖ్యవిధాతకు జ్ఞానదాతకున్. 31

ఉ. కన్నది గాదు నే నడవిఁ
గన్నది, పువ్వుల నుంచి పెంపఁగా
మన్నది, పూజ్యసేవకయి
మన్నది, మీ కృప నాశ్రయింపఁగా
నున్నది, బంధులన్ వదలి
యున్నది చిన్నది, దీని మాని చే
కొన్నఁ దరింతు, నా వనిత
కోర్కె ఫలించుఁ దపోధనాగ్రణీ! 32

క. కరుణాద్భుతగాథ నిటుల్
గురుజను లొండొరులు చెప్పికొన విను తరుణీ
తరుణుల డెందము లలరుచుఁ
బరమానందమున నైక్యభావం బందెన్. 33

మ. ననలన్ గొమ్మలఁ బుష్పహాసరుచి నా
నందించు భృంగోత్కరం
బును దేనెల్ చిలికించు నబ్జములు సొం
పుల్ నింపు రంభాతరుల్
విన నింపౌ పికగానముల్ కనులకున్
విందౌ రసాలావళుల్
గన భూలోకము పెండ్లిమండపముగాఁ
గన్పట్టె నవ్యద్యుతిన్. 34

చ. సుభగము లయ్యెఁ దోయములు,
శుభ్రనభస్థలిఁ జంద్రతారకా
విభవ మెసంగెఁ, గానలు న
వీనలతాద్రుమపల్లవోల్లస
ద్విభవము లయ్యెఁ, బక్కణపు
వీథులు మంగళతోరణావళీ
ప్రభలఁ జెలంగె, సృష్టి కను
బండువుగాఁ గనుపట్టె నెల్లెడన్. 35

B V. K

చ. కనకపుఁగాంతు లీను నునుఁ
గావి ధరించి తనూజు బాలభా
నుని నొడిఁ బూని ప్రాక్సతి మ
నోహరకోకిలనిస్వనంపుటీ.

వన లిడె; దక్షిణాంగనయు
బంధురగంధవహమ్ము నిచ్చె నా
వనచరరాజకన్యక వి
వాహమహోత్సవవేళ నర్మిలిన్ 36

చ. పరువపుమల్లెపూలతలఁ
బ్రాలు వనేచరరాజకన్యకా
కరకలితంబులై యరుణ
కాంతి విరాజిలె మానిరాడ్జటా
భరనిహితంబులై పరమ
పావనగాంగఝురీప్రభల్ మహే
శ్వయని శిరంబునం బలె శు
భప్రభ నొప్పె జనాళిచూడ్కికిన్. 37

చ. అరమర లేని భక్తి ఋషు
లందఱుఁ బ్రణమిల్ల నావధూ
వరులకు వార లొక్కమొగి
భారతధాత్రి సముద్ధరించు సు
స్థిరమతి ధార్మికుండు రిపు
జేత సుపుత్రుఁడు గల్గుఁగాత మం
చురునిగమప్రపాఠముల
నూల్కొన దీవన లిచ్చి రిమ్ములన్. 38

ఉ. పచ్చనితోరణా లలరు
పందిటఁ బందుగు లెల్లఁ బ్రీతిమై
నిచ్చిన కానుకల్ గొనుచు
నీడగు పెన్మిటిఁ గూడు పుత్రికన్
మెచ్చుచుఁ జెంచెతల్ గలిసి
మేలము లాడెడువేళఁ దల్లి తా
ముచ్చట దీరఁ గన్గొని ప్ర
మోదపుటశ్రులు నించెఁ గన్నులన్. 39

ఉ. ఫుల్లసరోజనేత్రుఁడు ప్ర
పూర్ణకృపాభరణుండు వాగ్వధూ
వల్లభమూర్తి భక్తజన
వశ్యుఁడు విశ్వకలానుభూతి రా
జిల్లెడువాఁడు జ్ఞానసుధఁ
జిల్కెడు హాసమువాఁడు యాత్రికుం
డల్లుఁడు గాఁగఁ బొల్చె శబ
రాగ్రణి హైమనగాధిపోన్నతిన్. 40

ఉ. లోకములోన నెద్ది యతి
లోకవిభూతి నెసంగు, నెద్ది సు
శ్రీకము నూర్జితంబును బ్ర
సిద్ధము నౌ, నది యెల్లఁ ద్వత్ప్రభా

నీకములోని లేశ మని
నే నెఱనమ్మట నీ ప్రశస్తి నే
వాకొనినాఁడఁ దండ్రి! భవ
పాశవిమోచన! భక్తవత్సలా! 41

క. భవ్యార్థదాయకం బీ
నవ్యకృతిఁ విని విన్నచిన న్నరులకు స
ర్వవ్యథలు దొలఁగుఁ, జేకుఱు
నవ్యయమగు శుభము లైహికాముష్మికముల్. 42

మాలిని. విదళితభవపాశా! వేదవేద్యప్రకాశా!
సదమలమణిభూషా! సాధురక్షామనీషా!
హృదయనిహితజాయా! యిందుమౌళిప్రగేయా!
పదనతవిబుధేశా! పాహిమాం వేంకటేశా! 43

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధలలితకవితావైభవ
కోటాన్వయోద్భవ భారద్వాజసగోత్ర ఆదిలక్ష్మీ
సుబ్బరాయపుత్ర ఉభయభాషాసాహిత్యవిద్యా
ప్రవీణ సుధీవిధేయ సుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతంబైన "శబరబాలా" నామక
భారతాభ్యుదయ ప్రబంధము
సర్వము సంపూర్ణము.
హరిః ఓం తత్సత్.

మ. వనలన్ గొమ్మలఁ బుష్పహాసరుచి నా
నందించు భృంగోత్కరం
బును దేనెల్ చిలికించు నబ్జములు సొం
పుల్ నింపు రంభాతరుల్
విన నింపౌ పికగానముల్ కనులకున్
విందౌ రసాలావళుల్
గన భూలోకము పెండ్లిమండపముగాఁ
గన్పట్టె నవ్యద్యుతిన్. B·V·K 34

చ. సుభగము లయ్యెఁ దోయములు,
శుభ్రనభస్థలిఁ జంద్రతారకా
విభవ మెసంగెఁ, గానలు న
వీనలతాద్రుమపల్లవోల్లస
ద్విభవము లయ్యెఁ, బక్కణపు
వీథులు మంగళతోరణావళీ
ప్రభలఁ జెలంగె, సృష్టి కను
బండువుగాఁ గనుపట్టె నెల్లెడన్. 35

చ. కనకపుఁగాంతు లీను నునుఁ
గావి ధరించి తనూజు బాలభా
నుని నొడిఁ బూని ప్రాకృతి మ
నోహరకోకిలనిస్వనంపుదీ

వన లిడె; దక్షిణాంగనయు
బంధురగంధవహమ్ము నిచ్చె నా
వనచరరాజకన్యక వి
వాహమహోత్సవవేళ నర్మిలిన్ 36

చ. పరువపుమల్లెపూలతలఁ
బ్రాలు వనేచరరాజకన్యకా
కరకలితంబులై యరుణ
కాంతి విరాజిలె మానిరాడ్జటా
భరనిహితంబులై పరమ
పావనగాంగఝురీప్రభల్ మహే
శ్వరుని శిరంబునం బలె శు
భప్రభ నొప్పె జనాళిచూడ్కికిన్. 37

చ. అరమర లేని భక్తి బుధు
లందఱకున్ బ్రణమిల్ల నా వధూ
వరులకు వార లొక్కమొగి
భారతధాత్రి సముద్ధరించు సు
స్థిరమతి ధార్మికుండు రిపు
జేత సుపుత్రుఁడు గల్గుఁగాత మం
చురునిగమప్రపాఠముల
నూల్కొన దీవన లిచ్చి రిమ్ములన్. 38

ఉ. పచ్చనితోరణా లలరు
పందిటఁ బంధుగు లెల్లఁ బ్రీతిమై
నిచ్చిన కానుకల్ గొనుచు
సీడగు పెన్మిటిఁ గూడు పుత్రికన్
మెచ్చుచుఁ జెంచెతల్ గలిసి
మేలము లాడెడువేళఁ దల్లి తా
ముచ్చట దీరఁ గన్గొని ప్ర
మోదపుటశ్రులు నించెఁ గన్నులన్ 39

ఉ. ఫుల్లసరోజనేత్రుఁడు ప్ర
పూర్ణకృపాభరణుండు వాగ్వధూ
వల్లభమూర్తి భక్తజన
వశ్యుఁడు విశ్వకలానుభూతి రా
జిల్లెడువాఁడు జ్ఞానసుధఁ
జిల్కెడు హాసమువాఁడు యాత్రికు
డల్లుఁడు గాఁగఁ బొల్చె శబ
రాగ్రణి హైమనగాధిపోన్నతిన్ 40

ఉ. లోకములోన నెద్ది యతి
లోకవిభూతి నెసంగు, నెద్ది సు
శ్రీకము నూర్జితంబును బ్ర
సిద్ధము నౌ, నది యెల్లఁ దత్ప్రభ

నీకములోని లేశ మని
నే నెఱనమ్మ్రుట నీ ప్రశస్తి నే
వాకొనినాఁడఁ దండ్రి! భవ
పాశవిమోచన! భక్తవత్సలా! 41

క. భవ్యార్థదాయకం బీ
నవ్యకృతిం విినిన వినిచిన న్నరులకు స
ర్వవ్యథలు దొలఁగుఁ, జేకుఱు
నవ్యయమగు శుభము లైహికాముష్మికముల్. 42

మాలిని. విదళితభవపాశా! వేదవేద్యప్రకాశా!
సదమలమణిభూషా! సాధురక్షామనీషా!
హృదయనిహితజాయా! యిందుకాళిప్రగేయా!
పదనతవిబుధేశా! పాహి మాం వేంకటేశా! 43

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధలలితకవితావైభవ
కోటాన్వయోద్భవ భారద్వాజసగోత్ర ఆదిలక్ష్మీ
సుబ్బరాయపుత్ర ఉభయభాషాసాహిత్యవిద్యా
ప్రవీణ సుధీవిధేయ సుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతంబైన "శబరబాలా" నామక
భారతాభ్యుదయ ప్రబంధము
సర్వము సంపూర్ణము.
హరిః ఓం. తత్సత్.

# పండితాభిప్రాయములు



## వేలూరి శివరామశాస్త్రి

చిరివాడ (Via) తేలప్రోలు కృష్ణాడిస్ట్రిక్టు

6-4-57.

శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు P.O.L.

నెల్లూరు.

అయ్యా!

మీ పంపిన 'శబరబాల' ఆమూలాగ్రము చదివితిని. నేఁ జదివితి ననుటకంటె అదియే నన్ను చదివించినదనుట సత్యము.

కవిత కుండవలసిన ప్రసన్నత మొదలుకొని ప్రాణమువంటి శబరబాలలో బాలకశరీరమువలె నిగనిగని నిగ్గులు చూపుచున్నవి. ఇతోధికముగా భాసింపఁగల జీవాకూతి దీనఁగని ఆనందించితిని.

గ్రహింపవలెను,

వేలూరి శివరామశాస్త్రి.

# "సాహిత్యాచార్య, సాహిత్యసమ్రాట్, కవీంద్ర మహోపాధ్యాయ" స్వామి శివశంకర శాస్త్రి అధ్యక్షు, సాహితీసమితి, ఒంగోలు.

శబరబాల అను నామాంతరముగల "భారతాభ్యుదయము" ఉత్తమ పద్యకావ్యము. ఏతద్రచయిత శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ప్రామాణిక కవులలో చేరదగినవారు. ప్రసిద్ధవైయాకరణులైన బ్రహ్మశ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారి శిష్యులు. గురుభక్తి కలవాడగుటచే ఈ కవి 'హనుమచ్ఛాస్త్రిని శబ్దశాస్త్రనిధి విద్యాదేశికుఁ గొల్చెదఁ' అని యుగ్గడించినాడు. కవి దేవతాభక్తియుక్తుఁ డగుటచే కావ్యములో మహేశ్వర, శ్రీరామ, సరస్వతీకీర్తనము కానవచ్చుచున్నది.

ఈ కావ్యేతివృత్త ముత్పాద్యము. కథలో విషయనిగరణరేఖ తొంగిచూచుచున్నది. ప్రారంభమునను తరువాత కొంతమారమునను హింసాకాండము నరబలిప్రయత్నము కనబడుచున్నను కావ్యము శాంత రసప్రధాన మని చెప్పనొప్పును.

కవి వ్యాకరణనిష్ణాతు డగుటచే కావ్యమున చ్యుతసంస్కారదోషము లేదు. అలంకారశాస్త్రకోవిగుడగుటచే కావ్యశరీరమున ఔజ్జ్వల్య మున్నది. మహాకవులమార్గ మెరిగినవా డగుటచే కృతి చక్కగా నడచినది. కవిత్వము ధారాశుద్ధి కలిగి ఉచితవర్ణనములతో నొప్పారుచు తాత్పర్యార్థము స్ఫురింపచేయుచున్నది. ఈ కవి శైలి సర్గబంధరచనకు సముచితమైనది.

సాహితీసమితి, 20-2-57.

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని M.A. (Hons.), ph.D.

323 విద్యానగర్, హైదరాబాదు, 18–2–57.

శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన 'భారతాభ్యుదయ' మను శబరబాల నామూలాగ్రముగఁ జదివి యానందించితిని. దానిని జదువుచుండఁగాఁ "గొనిపోయెన్నను నెద్దియో యెచటికో క్రొంగ్రొత్త లోకానకుఁ", అనవసరపదాడంబరము కాని యన్వయక్లేశము కాని లేక యిందలికవిత ధారాళమును సుప్రసన్నమునై నన్నయభట్టారకుల శైలిని స్మృతికిఁదెచ్చినది. ఆధునిక కవికృతులలో నింత నిర్దుష్టములును రసవంతములునైన కావ్యములను నే నెన్నిటినో చూచియుండలేను. శబరబాల పూత ముగ్ధప్రణయ మందు మనోహరముగ వర్ణింపబడినది. భారతాభ్యుదయ సూత్రధారుఁడైన మునికుమారుని శీలస్వరూపములు నేర్పుతో చిత్రింపఁబడినవి. కావ్యమున నెవ్వరికిని నిశ్చితములైన పేరులు లేవు. అది యిందలి కథలోని విశ్వజనీనతకుఁ దార్కాణ. పద్యము లన్నియు ధారాశుద్ధికిని భావగాంభీర్యమునకును నెలవులై చాల హృద్యముగా నున్నవి. శ్రీ శాస్త్రిగారింకను ఉదాత్తములైన రచనలు కావించి యాంధ్రభాషాయోష నలంకరింతురుగాక.

*   *   *   *

విద్వత్కవికులతిలక పి. శ్రీరాములురెడ్డి,

చిత్తూరు, 13–2–57.

ఆర్యా,

మీ యుత్తరమును 'శబరబాల'యను చిన్ని కావ్యము నందినది. చదివితి. మీ శైలి కడు మనోహరము. లలితపదయుక్తము. ఇట్టి గ్రంథములు మఱియు వ్రాసి భాషాసేవ ఇతోధికముగఁ గావింతురుగాత. శ్రీరామచంద్రమూర్తి సర్వసౌఖ్యము లొనఁగూర్చుఁగాత.

ఇట్లు,

పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ,
తిరుపతి, 14-2-57

బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సన్నిధికి, ప్రణామములు.

మహాశయా!

తాము దయతో పంపిన భారతాభ్యుదయముప్రతి అందినది. ధన్యవాదములు. సాంతముగా చదివి చవిగొన్నాను. మొదటినుండి తుదవఱకును వ్యుత్పన్నమై ధారాళమైన శయ్యావైభవముతో నడచినది తమ రచన. సంస్కృతాంధ్రములు రెంటినిగూడ సమానమైన సిద్ధహస్తతతో సుకుమార మధురభావములతో నిర్వహించితిరి. కథాపోషణమునను పాత్ర స్వరూపచిత్రణమునను తను భవిష్యత్కవిత యింకను ఉజ్జ్వలమై లోక కల్యాణానందసాధనమై వెలయగలదని నా యాశంస.

చిత్తగింతురు,
రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

## విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఆర్యా,

మీరు ప్రేమపూర్వకముగా పనిచిన మీ భారతాభ్యుదయము (శబర బాల) చేరినది. చేరినదేతడవుగా గ్రంథమంతయు సాంతయు మక్కువతోఁ బఠించితిని.

మీయితివృత్త కల్పనాశిల్పమును కథాకథనకౌశలమును పద్యరచనా ప్రాగల్భ్యమును నాకత్యంతానందమును గలిగించినవి. శబరబాల మీచేతి ప్రోపున సర్వాంగసౌష్ఠవముతో నాలుగంచులు తీరి రసికహృదయముల నాకర్షించుచున్నది. దేశభక్త్యుద్బోధకమును రసభరితమును, మధుర భావభావనాభావుకమునునైన మీ కృతి యీనాటి యుత్తమకావ్యశ్రేణి కెక్కి మీ కావ్యకళావైదుష్యమును లోకమున వెల్లడించి మీకు పేరు ప్రతిష్ఠలను సమకూర్పఁగల దనుటలో సందియములేదు.

మీ చేతికలమునకు మంచి భవిష్యత్తు కలదు. మీ రింకను రసవత్కృతు లను వెలయించి ఆంధ్రభారతి నలంకరింతురుగాక.

ఇట్లు
భవదీయుఁడు,
దీపాల పిచ్చయ్యశాస్త్రి.

## ఇంగువ శ్రీకృష్ణయ్య, బి.ఏ., బి.యల్.

బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన "భారతాభ్యుదయము (శబరబాల) యను ఖండకావ్యమును ఆమూలాగ్రముగ చదివితిని. కవిగారి ప్రథమప్రయత్నమైనను కావ్యము నిర్దుష్టమై ధారాశుద్ధిగలిగి యున్నది. సూర్యోదయాదుల వర్ణనలు రమ్యముగ నున్నవి. జలకలశము తెచ్చు శబరబాల, సూర్యున కర్ఘ్యమిచ్చు వ్రతి, కాళికాదేవి, ఈ మున్నగు వర్ణనలు స్వాభావికముగనుండి ఆయావారల గన్నులకెదుట నిలుపుచున్నవి. ఆంధ్రలోకమున శాశ్వతముగ నిలువగల అర్థాంతరన్యాసముల పెక్కింటిని కవి అందునందు కూర్చియున్నాడు. శాంతవీరములు, శాంతశృంగారములు విరోధిరసములైనను వీనిని కూర్చుపట్ల కవి చూపిన ప్రౌఢిమ శ్లాఘ్యము.

ఆయుష్మంతుఁడగు కవిగారికి పరమేశ్వరుడు ఆయురారోగ్యముల నిచ్చి ఇతోధికముగ సారస్వతసేవ చేయునట్లనుగ్రహించుగాత.

నెల్లూరు
19–3–57

ఇంగువ శ్రీకృష్ణయ్య,
నెల్లూరు వేదసంస్కృతకళాశాల
మేనేజింగుకమిటీ అధ్యక్షుడు.

# తప్పు ఒప్పుల పట్టిక

~~~[:o:]~~~

| పొరట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 2 | చిన్మయతేజము | ఁజిన్మయతేజము |
| 14 | 3 | మండితమౌ సరోవర | మండితమౌ జలాశయ |
| 28 | 4 | కన్గవ సిగ్గు దొలంకఁ | సిగ్గు కనుంగవఁ దొల్కఁ |
| 37 | 6 | వరిల్ల్ధ | వరిల్ధ్ల |
| 40 | 12 | కొంగ్రొత్తలోకానకున్ | క్రొంగ్రొత్తలోకానకున్ |
| 42 | 11 | ననఁ దొడగెన్ | ననఁ దొడిగెన్ |
| 84 | 5 | మదోద్ధతిన్ గలిసి | మదోద్ధతిన్ గవిసి |
| 86 | 9 | వనితటి | వనతటి |
| 90 | 5 | మల్లెపూలతలఁ | మల్లెపూల తలఁ |
~~~

# రామ తారకము

## బాలకాండము



కోట సుబ్రహ్మణ్యశాస్త్రి

# కృతజ్ఞత



మహాశయులారా!

శ్రీరామకథావర్ణనాపరములగు కావ్యములు ఆంధ్రమునందు పరశ్శతము లున్నను ఆత్మోపకారక మగుటచే నీకథ నేను శ్రీ రామతారక మను పేర సంగ్రహముగ వ్రాయఁగోరి అందు బాలకాండమును బూర్తిచేసితిని, ఇందు నాయాత్మవిశ్వాసము దృఢపడుటకై ముందీబాలకాండము నచ్చొత్తించితిని. ఈ కార్యముఁ గొనసాగించుటలో అల్పసత్త్వుఁడనగు నాకుఁ దోడ్పడిన మిత్రబృందమునకు నా కృతజ్ఞత నీ కావ్యముఖమునఁ దెలిపికొనుట నా కవశ్యకర్తవ్యము.

1. శ్రీ మందాకినీ పత్రికాముఖమునఁ బ్రకటితములైన యిందలి పద్యములఁ జదివి పరితృప్తులై ముద్రణవ్యయమునకుఁ జాలవఱకు సాముదాయికముగఁ దోడ్పడిన శ్రీ వేంకటగిరిరాజ కళాశాల విద్యార్థులు నా కత్యంత మభినందనీయులు, ముద్రణకార్యమునకుఁ గొఱవడిన ధనమును అయాచితముగ నొసంగి సాయమొనర్చినవారును కవివతంసులును మా మిత్రులును అగు బ్రహ్మశ్రీ పంచాగ్నుల హనుమచ్ఛాస్త్రిగారు నాకెంతయు నభివంద్యులు.

2. మున్ను నేను రచించిన "శబరబాల" కావ్యమును బరిశీలించి దానిపైఁ జక్కని సమీక్ష వ్రాసి తమ పత్రికలోఁ బ్రకటించుటయే గాక శ్రీ రామతారకములోని పద్యముల నెప్పటికప్పుడు తన మందాకినీ పత్రికలో బ్రకటించి యీ చిన్ని కబ్బమును జక్కఁగ నచ్చొత్తించి నన్నుఁ బ్రోత్సహించుచున్న వారును "కర్ణచరిత" "శ్రీ సాయిబాబా చరిత"ముల కర్తలును శ్రీ మందాకినీ సంపాదకులు నగు శ్రీ మరుపూరి కోదండరామరెడ్డిగారు నాకెంతయు స్తవనీయులు,

3. ఏ తత్కావ్యము పూర్తియైనతోడనే నాకోరికకి నంగీకరించి దానిని సమీక్షించి యమూల్యములగు నుపదేశము లొసంగినవారును "అభినవనన్నపార్య" బిరుదాంకితులునగు శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు నాకెంతయు నమస్కార్యులు.

4. నేను గోరినవెంటనే యీ కావ్యమును ఆమూలాగ్రముగ సమీక్షించి అమూల్యములగు నుపదేశముల నిచ్చుటయే కాక స్వేపోటుచేసి ప్రూపులు దిద్ది ముద్రణకుఁ దోడ్పడినవారును, 'నాట్యకవితాకళానిధి' 'మహాకవి' బిరుదాంకితులును అగు విద్వాన్ శ్రీ దర్భా వేంకటకృష్ణమూర్తి యమ్. ఏ. గారు నాకెంతయు నభివందనీయులు.

5. తమ రమణీయ భవనములో మున్ముందు సారస్వతగోష్ఠి నేర్పాటుచేసి అందు శ్రీ రామతారకకృతిపఠనమును జరిపించి తా మానందించి సహృదయుల నానందింపఁజేసి నన్నుఁ బ్రోత్సహించినవారును శ్రీ వేంకటగిరిరాజ హైస్కూలు అసిస్టెంటు హెడ్‌మాస్టరును అగు శ్రీ కె. రామలింగారెడ్డిగారు, బి. ఎ., యల్. టి. నాకెంతయు స్తుతిపాత్రులు.

6. శ్రీ రామతారకమును సభలో నిఖిలజనానురంజకముగఁ బఠించి నన్ను బ్రోత్సహించినవారును శ్రీరామభక్తిభరితులున్న రేడియో పౌరాణికులును అగు శ్రీ ఆకిలి మల్లికార్జునయ్యగారికి నాకృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

7. ఈ కావ్యమును శ్రద్ధాసక్తులతోఁ జదివి నా యుత్సాహమును బ్రోదిచేయు నభిప్రాయముల సత్వరముగ నందఁజేసినకవిపండితలోకమునకు నా నమస్కారములు.

ఇట్లు బుధవిధేయుఁడు.

కోట సుబ్రహ్మణ్యశాస్త్రి.

నీ కరుణాసుధారసము
నిండిన నా హృదయాలవాలమం
దీ కవితాప్రరోహ ముద
యించి భవత్పదకల్పశాఖిపైఁ
బ్రాఁకి సువర్ణసౌరభని
భాసి ప్రసూనము పూచె, దీని ని
ష్కాకు వతంస! చేకొనుము
భక్తి నొసంగితి, భక్తవత్సలా!

# అభిప్రాయములు



## T. V. SIVARAMAIYA

ADVOCATE

**NELLORE.**



My dear Sir,

Many thanks for the copy of "SREE RAMA THARAKAM" which you so kindly put in my hands.

I read through the book with pleasure and interest. The story is well-known. It is ages old and even to-day retains its attraction. It is told by many authors, and in many ways, in prose and verse and in the form of a drama. Such is the simple grandeur of the story and the sublime eminence of the characters that play their parts in it. Repetition has not dullened its attraction and I am sure never will. Even in the present age, when things sublime and spiritual are fast losing their intrinsic value, Rama's story has not lost its appeal and never will. Your ambition to reproduce the story of Rama is indeed praiseworthy, though perhaps one could wish that poetic talent should almost always be employed in rolling in fine frenzy and in giving shape to things new and unknown and in giving them a local habitation and a name.

Your book has the merit of being written in a simple, chaste, attractive and easily under-standable style. The Verses are well-knit, flowing and at the same time terse and have no waste words. In them there is grace and "Ease, the first essential to please"

The book is interesting reading and I am sure it will have a high place in current Literature.

—:(o):—

*Kavi Sarvabhauma, Mahopadhyaya, Sahityacharrya,
Sahitya Samrat, Kaveendra

## Swami Siva Sankara Sastri,

President - Sahiti Samiti

MEMBER

Andhrapradesh Sahitya Academy; Hyderabad.
Advisory Board, Sahitya Academy; New Delhi.

GUNTUR



శాస్త్రిగారూ ! మీరు ప్రీతితో పంపిన "రామతారకము" ఒంగోలులో అందినది. పూర్తిగా చదివినాను.

సుదీర్ఘమైన రామాయణము చదువుటకు ఓపిక కావలెను. ముఖ్యమైన ఘట్టములను ఏర్పరించి నాతిదీర్ఘముగా హృద్యముగా సరళముగా మీరు రచన చేసినారు. మీ విధానము సర్వథా ప్రశంసార్హము. విద్వత్కవులైన మీ రచన ప్రామాణిక మని వేఱె చెప్ప నక్కఱ లేదు. ఇతిశమ్



*డా. దివాకర్ల వేంకటావధాని, ఎం. ఎ. ఆనర్సు; పి. హెచ్ డి.

READER IN TELUGU

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

బ్ర. వే. శాస్త్రిలవారి సన్నిధికి, అనేక నమస్కారములు. తాము దయతో పంపిన రామతారకము బాలకాండము చేరినది. అందున్నయైదు ఖండములను చవిచూచి యానందపరవశుఁడ నైతిని. అందలి భావ భాషా శైలులు పరమ ప్రసన్నములై తమ భక్తి భావ నైర్మల్యమును చెప్పక చెప్పుచున్నవి. అన్వయ కాఠిన్యము కాని, శబ్దాడంబరము కాని, అనవసరాలంకార ప్రయోగో

ద్యోగముకాని లేక కాండ మంతయుఁ గమనీయమై ధారాశుద్ధి శోభితమై సర్వజనానుభోగ్యముగా నున్నది. శ్రీ రామతారక మను పేరు భక్త్యుద్బోధకమై యాముష్మికము వంకకు దృష్టి మర లించుచున్నది. ఏ భాషలో గాని రామాయణము వ్రాసిన కవి యెవ్వరును మహాకవి కాకపోలేదు. తమయం దాలక్షణము లిది వఱకే యున్నవి. తక్కిన కాండములను గూడ నచిరకాలమున వెలువరించి రసపిపాసువుల యుత్కంఠ తీర్తురుగాక.



*జి. వి. సుబ్బరామయ్య,
ప్రిన్సిపాల్ బి.పి. యన్. కాలేజి. నిడుబ్రోలు, 22-12-59.

శ్రీ రామతారకము రచించిన సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ "శబరబాల" చే ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. విద్వత్కవికూటమున సుప్రసిద్ధులు. రామాయణ బాలకాండ లోని ప్రధానఘట్టముల నభివర్ణించుచు ఈ కృతిని రచించి 'శ్రీ రామతార కము' అని నామకరణ మొనర్చినారు.

శ్రీ రామకథను పలువురు మహాకవులు పలువిధముల రచించి తమ జన్మము సార్థకమొనర్చికొన్నారు. ఇందు పునరుక్తి దోషము లేదు. ఏల యనగా గంగా స్నానమువలె నిదియు ఆత్మాభ్యుదయ సాధనము. మఱియు 'రాఘవేశ్వరు చారిత్రము నెందఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే' అని నాఁడు కంకంటి పాపరాజు. కావున శ్రీ రామచరిత్రమును చర్వితచర్వణ మొనర్చినందులకు ఈ కవిగారు అభినందనీయులే.

ఈ కృతి రాజము పరిమాణమున చిన్న దయ్యును పరిణామమున పెద్దదే. శ్రీశాస్త్రిగారి కవిత్వము మధురము, మధురాక్షరము. ఇది అనువాదము

కాదు. కథావస్తువు ప్రాచీనము లోకప్రసిద్ధము అయ్యును ఏ తత్కథన పద్ధతి యందును భావములందును శైలియందును ఒక నూతనత, విశిష్టత, వైలక్షణ్యము దీపించుచున్నది. మఱియు ప్రాశకావ్య లక్షణములగు శబ్దాలంకారములచే అర్థాంతరన్యాసాదులచే ఈ కావ్యము సుసంపన్నమైనది. కవనశైలి చిక్కనై జిగిబిగిగలిగి శాస్త్రిగారి సిద్ధహస్తతను ప్రదర్శించుచున్నది. కొన్ని తావులఁ దిక్కన, పోతన, శ్రీనాథ, పెద్దనాది మహాకవుల యెత్తుగడలను, పోకడలను, ఇందలి పద్యములు తలఁపునకుఁ దెచ్చుచున్నవి. మచ్చున కొక పద్యము.

"తరణికులాబ్ధిసోమ భవతారకనామ మదీయపాతకో
త్కరనిబిడాంధకారఖరదామ వనాంతరమౌనిఘాతకా
సురరణభీమ నీలతనుశోభిభుజాంతరపద్మదామ త్వ
చ్చరణ సరోజయుగ్మ మనిశమ్మును నామదియందు నిల్పుమా!

శ్రీ శాస్త్రిగారు ఈ తీరునన రామాయణము నంతయు రచించి కృతకృత్యు లగుదు రనియు ఈ కృతిని, ఈ వరుసలో రాబోవు కృతులను ఆంధ్ర పాఠకలోకమును విద్యాధికారులును సమాదరింతు రనియు ఆశించువాఁడను.



*పంచాగ్నుల హనుమచ్ఛాస్త్రి, విడవలూరు.

సీ॥ ఒక్క-చో వాచ్యార్థ మున్నతస్థితిఁ బొల్చు
  నొక్క-చో వ్యంగ్యంబు లుట్టిపడును
ఒక్క-చో లక్షణ యొప్పిదమై చెల్లు
  నొక్క-చోఁ గల్పన లూర్జితములు
ఒక్క-చో రసపుష్టి యూర్జస్వితఁ జెలంగు
  నొక్క-చో భావముల్ హాయిలుమించు

నొక్కచో శబ్దముల్ చక్కనై రహిమించు
నొక్కచో నర్థసంయుక్తి మెఱయుఁ

తే. జక్కఁగా నిన్నిరీతుల సాగెఁ గవిత
నెక్కడో రామపదభక్తి కిక్క యాట
నిక్కముగ నిట్టి నిపుణత నీకె దక్కె
సరస కోట సుబ్రహ్మణ్యశాస్త్రివర్య!



*'సాహిత్యరత్న,' 'సరసకవి,' మోచర్ల రామకృష్ణయ్య, అడ్వకేటు.

మ. నవతాజీనకళావిరాజిత, రసామ్నాయస్థిరావాసరా
ఘవగామానఘబాల్యవిక్రమయశఃకల్యాణగాథాసుధా
ర్ణవవీచీ పవమానసంహృతభవప్రాగ్భారసంఘాత, మా
ర్దవసంపద్యుత, తావకీనకృతి సుబ్రహ్మణ్య విద్వత్కవీ!

************

'నాట్యకవితా కళానిధి,' 'మహాకవి'
*విద్వాన్ శ్రీ దర్భా వేంకటకృష్ణమూర్తి, M. A;
Head of the Telugu Department,
*V. R. College, Nellore.*

కం. కృతి రామతారకం బఁట
కృతిపతి శ్రీరాము డంట, కృతహస్తుం డీ
కృతికర్త 'ప్రౌఢకవి' యఁట
ఇతోఽధికం బేమివలయుఁ గృతకృత్యతకున్.

* తుమ్మల సీతారామమూర్తి. అప్పికట్ల 12-12-59

విద్వత్కవివరేణ్యులు శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన శ్రీ రామతారకము చదివి లెస్స తనిసితిని. శ్రీ శాస్త్రిగారివలె రెండు బాసలలో దిటవు గలిగిన కవులు నేఁడెందఱోలేరు. వీరి కైతలో రామకథ కొక క్రొత్త సొగసు వచ్చినది. ఈ కావ్యమునం దన్వయ క్లిష్టత మృగ్యము, శైలి గిరిశిరస్సరజ్ఝరీ సోదరము.

"తినబోవుచు స్వాద్యత పృచ్ఛసేయగన్" "సజ్జన కోపము విద్యుదాభము" "ప్రాణి తన హానిని తావరియించు మూర్ఖతన్" "ప్రియుఁడు కన్నుల గప్పికొనంగ" "అందము చూడ్కుల చంద మామ" "ప్రాణముల్ పిడికిటఁబట్టి" 'పాపము పండి' "పాఱిరి చెట్టుకొక్కడై" "ప్రొద్దు పండఁబాఱె" మున్నగు పలుతరముల యొఱపులిందు కుదుర్కొని చదువుగల చదువరుల మదిని సొగయించుచున్నవి.

సంస్కృతాంధ్రములు రెంటియందును శ్రీ కోటవారు నేర్పరులనుట కీ కృతిలోఁ బెక్కుతావులు చూపవచ్చును.

మచ్చునకు 92, 125 పద్యములు గనవలయును. అయినను దెనుఁగుఁ దనము మఱికొంత హెచ్చినచో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కవిత మిగుల రాణించును. తక్కిన కాండము లీ బలిమితో వెలయునని తలంతు.

* మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి. కవితాసామ్రాజ్యము కర్నూలు 16-12-59

మహాశయా! నమస్కారములు తామభిప్రాయార్థము పంపిన శ్రీ రామ తారకము బాలకాండము ప్రతి చేరినది. ఎంతో ఆసక్తితో జదివినాను.

ఇంతటి యాసక్తిని బుట్టించినది మీ భారతాభ్యుదయ రచనయే. చవులూరించు మీ రచన చాల యానందమును గలిగించినది. కమ్మని ద్రాక్షాపాకము, హృదయ స్పందనము గలిగించు పలుకుబడి మీ లేఖిని కబ్బినది. ఎడతెఱిపిలేని చక్కని చిక్కనిధార మీ శైలిలో పొంగులు వాఱుచున్నది. గంభీరతా ప్రసన్నతలు మీ రచనకు మెఱుగులు. కర్కుఱుతుల కెడ మీయరాదను గట్టి పట్టుదల మీలో నున్నట్లు తోఁచినది. ప్రాచీనార్వాచీన సంప్రదాయముల పై నభిమానముగల యిరువాగులవారి యభిరుచులకును మేళవింపుగల నుడికారపు సొంపు, భావములయింపు పఠనాశక్తిని బెంపొందించుచున్నది. ఉప్పున చప్పన లేని యీనాటి కవుల రచనలేమి? యని పెదవి విఱుచువారికి కనువిప్పు గలిగింపవలెనని కాంక్షించు కొలది మంది కవులలో మీరొక స్థానమును పూరించినారని నా విశ్వాసము. దోరమాగిన మీ కవితాపాకమునఁ బక్వముగానున్న భవిష్యత్కృతులకు మా స్వాగతము.

* దీపాల పిచ్చయ్యశాస్త్రి. నెల్లూరు 1-1-60

ఆర్యా!

మీరు ప్రీతితో పంపిన శ్రీ రామతారకము (బాల కాండము) ఆమూలాగ్రము ఆస్థతోఁ జదివి యానందించితిని. కృతహస్తులగు మీ కవితను గూర్చియు ప్రత్యేక ప్రశంసయేల! మీ గ్రంథమంతయు మీ ప్రౌఢకవి బిరుదమునకు స్ఫోరకముగా నున్నది. కథ ప్రాఁతదైనను మీ రచనాచాతురిచేత నూతనత నంది చదువరుల యుల్లముల కుల్లాసము గలిగించుచున్నది.

ఇట్లే తక్కిన కాండములును శ్రీరామచంద్రుని యనుగ్రహమున త్వరలో వెలువడుగాక.

శ్రీ

# రామ తారకము

## బాల కాండము

ఉ. శ్రీకరమూర్తి, నీదుగుణ
సింధుతరంగములందుఁ దేలి, వా
ల్మీకి శరత్సుధాకిరణు
లీల వెలుంగుచునుండె నాకభూ
లోకములందు, విశ్వకవి
లోకము ధన్యతఁ గాంచె నీగుణా
నీకము వాకొనంగ భవ
నీరధితారక మహాః రాఘవా. 1

ఉ. రాచఱికంబు నొల్లక, య
రణ్యముఁ బట్టి యనాథజీవులన్
బ్రోచిన నీచరిత్రము న
భోభువనంబులఁ బ్రాఁకి పొల్పుగాఁ
బూచినపూలసౌరభము
మూరొ్కనఁ జాలరు తెల్లదీవులన్
రాచఱికంబుఁ గోరి రణ
రంగములన్ సృజియించుమానవుల్. 2

మ. సుజనస్తుత్యము, విశ్వమంగళము నే
సుశ్లోకు సద్గాథతో
నజరప్రక్రియ నిల్వఁ గల్గుకృతు లె
ట్లావిర్భవించున్ భువిన్,
ప్రజలే రాజులు, రాజులే ప్రజలుగా
భాసిల్లుకాలాన? నీ
రజపత్రేక్షణ, నీపదాబ్జము సదా
రాధ్యంబు గాకుండినన్.

ఉ. జీవకళాసుమంబులు స
జీవము లౌఁ గఁ గుదారవఁ
పావన నాదరమ్యమృదు
భావ రసామృతవృష్టిఁ దేలి, యిం
దీవరకాంతిహారి భవ
దీయకటాక్షవిలాసహాసనం
భావన మాకు భవ్యకృతి
భావుకతాఫలసిద్ధి భారతీ.

ఉ. సాధుజనావనక్షమము
సాత్త్వికతేజము దివ్యమాని సం
బోధిత మై మహిన్ వెలసె
భూతదయాపరిపూర్ణమానవో

పాధీక మై, మహామహిమ
బంధుర మై, మదనాభిరామ మై
సాధితసర్వలోకహిత
సౌఖ్యము నై రిపుదుర్నిరీక్ష మై.

# స వ నా వ న ము

ఉ. కమ్మని నిద్రమున్గినజ
గమ్ములు గ్రమ్మరఁ దెల్వి నంది నే
త్రమ్ములు విచ్చువేళ, దిన
రాజకరగ్రహణాప్తిఁ బద్మినుల్
సమ్మద మందువేళ, రఘు
సత్తముఁ డధ్వరరక్షణార్థమై
తమ్మునితోఁ బయల్వెడలెఁ
దాపసపుంగవువెంటఁ గానకున్.

చ. పరుగున వచ్చి లక్ష్మణుఁడు
పాదతటిన్ బ్రణమిల్లి 'తల్లి! నే
నరిగెద నన్నతోడ, మము
నధ్వరరక్షకుఁ దండ్రి పంపె, నీ
వరమరలేనిసమ్మతి శు
భాశిష మి'మ్మని వేడ సమ్మద
స్థిరమతి నంపె నాత్మజుని
దీవన లిచ్చి; సుమిత్ర యెట్టిదో!

ఉ. మానిని కోసలేంద్రసుత
మానవనాథునిమాట నిల్పఁగాఁ
బూనియొ, క్షత్రశబ్ద మిలఁ
బుట్టఁగఁ బుట్టినధర్మ మంచునో,

కానక కన్నబిడ్డలను
గానల కంపిన నోర్చెఁ గాని యిం
కేనలినాక్షి నిల్వఁ గల
చింతలలో నిటు వీరమాత నాఁ. 8

శుభవేళ నీక్రియ శోకింపరా దని
కృప వసిష్ఠుఁడు దుఃఖ మపనయింప,
గాధినందనుశౌర్యగాథలు వర్ణించి
మంత్రి సుమంత్రుండు మనవిఁ జేయ,
నన్నలతోఁ దమ్ము నంపింపలేదని
పిన్నతమ్ములమోము చిన్నవోవఁ,
జంద్రశాలకుఁ జేరి జాలమార్గములందుఁ
దల్లులు బిడ్డలదారిఁ జూడ,

ముద్దుఁగుఱ్ఱలు తనకంటె ముందు నడవ
దశరథేశుండు, కానకుం దరలిపోవు
కౌశికునివెంట వెలుపలిగడపదాఁక
వచ్చి యట నిల్చె, నూర్పులు వెచ్చవడఁగ. 9

కాతరభావముఁ బదలి—
కౌశికుకార్యముఁ దీర్ప, స్వీయమహా
చేతనధాతు వొక్కటియె
చిన్నికుమారులరూపుఁ బాలి సా

కేతపురమ్ము వీడి వని
కేఁగ జనినట్టుల భీతితోడ భూ
నేత విచేష్టుఁడై నిలిచె
నీరము లింకినపల్వలం బనన్. 10

ఉ. చారువిశాలలోచనుల
శారదచంద్రముఖాభిరాములన్
శూరకిశోరదర్శనుల
సూర్యకులాభరణైకమూర్తులన్
వైరివిదారణక్షముల
బంధురకార్ముకఖడ్గధారులన్
పౌరసమూహముల్ గనుల
పండువుగాఁ దిలకించి రెల్లెడన్. 11

క. పురవీథు లుపవనంబులు
పరిసరసేనానివేశపథములు నాసో
దరు లన్ని గడచి నడచిరి
సరసిరుహసుగంధివారిసరయువుఁ దటియన్. 12

ఆ. వె. అస్త్రశస్త్రవేత్త యబ్జాసనస్పర్ధి
గాధినందనుఁడు తపోధనుండు
శిష్యవత్సలుండు శ్రీరాము వీక్షించి
యిట్లు లనియెఁ బ్రేమ యుట్టిపడఁగ:— 13

మ. 'సరయూతీర తమాల కాంచనలతా
సాంద్రాటవిఁ మిమ్ము నా
తరమా కన్గొన రెండుమూఁడడుగులేఁ
దవ్వైన శ్రీరామ! నా
కరముల్ గైకొని మెల్లమెల్ల నడువం
గాఁ బోద, మిక్కాన పం
కరుహ ప్రస్ఫుటగంధతుందిలమరు
ద్గంభీర మీాక్షించితే. 14

మ. 'అసలే దివ్యతరంగిణీజలజదా
యాదంబు లీపాదముల్
కసుగందుఁ రఘురామ! కంటకశిలా
క్రాంతప్రదేశమ్ములఁ
"వసుధం బాద మిడంగ నొచ్చు" నని భూ
పాలుండు గై సేయఁడే
పసిపాపల్ నడయాడు కుట్టిమతటిం
బ్రత్యగ్ర పుష్పమ్ములఁ. 15

శా. 'నా కేదో మది భీతి తోఁచినది, భూ
నాథుండు మి మ్మంపుచో
"నాఁకొన్నఁ దెలియంగలేని సుతుల
య్యా" యంచుఁ గే ల్మోడ్చి తా

వాకొన్న ప్పటిపల్కు-లం దలంపంగా
భావ్యంబె మి మ్మాక్రియన్
రాకాసుల్ చదరంగ మాడువనికిన్
రమ్మంచుం గొంపోవంగన్. 16

ఉ. ‘ఆఁకలిదప్పులం దొలఁచి
యాత్మవికాసము నిచ్చువిద్యలన్
జేకొనుఁ డిచ్చెదన్, విమల
సింధుజలంబుల నాచమించి మీ
రేకడ నెట్లు వర్తిలిన
నెండకు వానకు గాసిలే దిఁకన్
నాకును జింత తీఱు రఘు
నందన! కానఁ బ్రయాణవేళలన్. 17

ఉ. భూపతి నుద్ధరింపఁగల
భూరిపరాక్రమశాలి వౌట నీ
కోసము వేచియుంటి; నవి
కుంఠితతేజము లస్త్రరాజముల్
న్యాస మొనర్పఁ గోరి సుది
నంబగు నా కిది, యస్త్రశస్త్రస
న్న్యాస మొనర్చినాఁడ, శర
ణంబవు నీ విఁక జృంభకాళికిన్. 18

ఉ. 'ఆసురవీరశక్తికి మ
రాసదముల్ చిరతప్తతాపసా
యాసవిశేషసత్ఫలము
లబ్జభవప్రముఖార్ఘసంప్రదా
యాసమవీర్యముల్ ప్రకటి
తార్హసమర్పణధన్యజన్మముల్
వాసవముఖ్యసర్వసుర
వర్ధితశక్తులు జృంభకాస్త్రముల్. 19

ఉ. 'ఏలితి రాజ్యముల్ దవిలి
యెత్తినకత్తికి నడ్డు లేక, ది
క్పాలురగుండె నీఱుగఁ ద
పం బొనరించితి నావిధాత చిం
తాలసమూర్తిమై నిలువ
నాయజుసృష్టికి మాఱు చేసితిన్;
గాలము మాఱె, నింతయు వి
కారముగాఁ గనుపట్టెఁ జూడ్కికిన్ 20

ఆ. వె. సంయమీంద్రుఁ డంత సరయూజలంబుల
నాచమింప దశరథాత్మజులకు
శుద్ధమానసులకు సిద్ధసంకల్పత
నావహింపఁజేసె నస్త్రబలము. 21

సీ. కాకపక్షవికాసకలిత మా చూడ్కిలో
సింహావలోకనశ్రీలు మించె
బాల్యచాపల్యంబు భాసిల్లునడకలో
భద్రేభశుభయానభంగు లడరె
స్మితపూర్వవాక్సుధాశీకరవృష్టిలో
నుత్సాహఘనదీప్తు లుల్లసిల్లె
శిశుభావవిస్ఫూర్తిఁ జెన్నొందుచేష్టలో
నుల్లోకకృతిలీల పల్లవించె

గీ. భయదవనరాజి శాద్వలపంక్తి యయ్యె
వస్తువిజ్ఞానకుతుకంబు విస్తరిల్లె
సంయమీశ్వరమంత్రప్రసాదలసద
మోఘదివ్యాస్త్రసిద్ధు లారాఘవులకు.

చ. వినయవిశారదుండు రఘు
వీరుఁడు కౌశికుఁ జూచి పల్కె నో
మునికులచంద్ర, త్వత్స్తవన
మున్ జెఱుపం దలకొన్నమానవా
శను లిఁక నేమిలెక్క? బల
శాసనుఁడున్ బ్రతిపక్షమాన నిం
ధన మగుఁ ద్వత్ప్రభావసము
దగ్రతఁ బేర్చినశస్త్రవహ్నికిన్.

చ. కనుఁగొనుచుండఁగా యజన
కర్మకు విఘ్న మొనర్తురో పవల్
వనతటి దాఁగి రే లరసి
వచ్చెదరో క్రతుఘాతఁ జేయఁగన్
వినఁ గుతుకంబు గల్గె నట
వీతటి రాక్షసచర్య లెల్ల నే
వినఁ దగియున్నచోఁ దెలుప
వేఁడెద మిమ్ము సవిస్తరంబుగన్. 24

చ. మనుజవిభుండు సభ్యులన
మక్షమునన్ ననుఁ బంచె నీయబిం
ధనసమ మౌమహాస్త్రతతి
తావకసత్కృప లభ్య మయ్యె నే
యనువున నైన నింకఁ దమ
యధ్వరరక్షను నిర్వహింతు నీ
మనమున నెంతమాత్ర మను
మానముఁ బూనకు తాపసాగ్రణీ. 25

చ. తనతలమీఁద నిర్ఝరిణి
తాండవమాడఁగ నభ్రకేశ మిం
పును దొలకింప నిశ్చలతఁ
బొల్చినశంభుఁ డనంగఁ జేరువన్

గన నగు నద్రి; దానిదరిఁ

గన్పడునాతరుషండ మిమ్ములన్

మునులు వసించునాశ్రమము

పోలికఁ దోఁచెఁ బ్రశాంతసత్త్వమై. 26

ఉ. క. తరునికరము లిరుకెలఁకుల

సరయువుఁ బూజించుఁ జూడు, శాఖాపుష్పో

త్కరముల జీవనదాతల

కరుదే యెటనేని పూజ లభినందనముల్. 27

చ. చెవిని సుధామధుద్రవముఁ

జిల్కెడుశ్రీరఘురాముపల్కులన్

దవిలి, మహాప్రమోదమునఁ

దన్మయతన్ క్షణ ముండి, గాధిసం

భవుఁడు ప్రసక్తిచే మదికిఁ

బొడిసెనఁ, జెప్పఁ దొడంగె నిట్లు శాఁ

భవమహిమంబు నాయెదుటి

పర్వతసానువు ప్రేలఁ జూపుచున్. ౨౮

మ. అదియే రాఘవ, స్థాణునాశ్రమము ము

న్నధ్యాత్మనిష్ఠున్ శివున్

గదియం బోయి వివేకశూన్యమతి యై

కంతుండు క్రొమ్ములుకలన్

హృదయంబుఁ గౌఁగిలించి ఫాలనయన
    ప్రేమానలజ్వాలలోఁ
బడ మైనం గదలింపలేక పడియెన్
    భస్మావశిష్టాంగుఁ డై. 29

అది మొదలుగ నీదేశము
విదితం బగు నంగసంజ్ఞ, విద్యావిభవా
భ్యుదయంబు లొదవు జనులకుఁ,
గదియంగా జంకు మునులఁ గామాదు లిటన్. 30

ఇట్లు నడచి వార లిష్టకథాగోష్ఠి
దవ్వు నించుకంతఁ దలఁప రైరి
స్థాణునాశ్రమంబు దా పయ్యె నింతలోఁ
బట్టపగటిప్రొద్దు పండఁబారె. 31

పరిణతదాడిమీఫలశు
    భప్రభతో రవిబింబ మొప్పె, వి
స్తరతరుమూలముల్ వదలి
    చల్లనినీడలు తూర్పుదిక్కుకున్
బరువిడసాగె, నిర్మల న
    భఃపరిణాహము సాంధ్యరాగ భా
స్వరతఁ జెలంగె, విశ్వము ప్ర
    సన్నతనొందె దినాంతవేళఁను. 32

క. చిత్రచరిత్రుఁడు విశ్వా
మిత్రుఁన కిరుకెలఁకులందు మీనాంకలస
ద్గాత్రుల దశరథనృపవర
పుత్రుల నంతంతఁ గాంచి మోదం బలరన్. 33

ఆ. వె. ధర్మచారులైన తాపసోత్తము లెల్ల
నర్ఘ్యవస్తుపాత్రహస్తు లగుచు;
గాధిపట్టి కెదురుగా నేఁగుదెంచిరి
స్నేహభరము చూడ్కిఁ జిందులాడ. 34

క. సేమం బడిగిరి ముని నభి
రామాకృతి నొప్పురాము రామానుజునిన్
బ్రేమార్ద్రత లోలుక సలిపిరి
యామహాత్ములు వారి కర్ఘ్య మాతిథ్యంబున్. 35

చ. సగపడ నిద్రదేరి వటు
సంఘము సౌరముఁ బల్కువేళ, ది
గ్గజముల మ్రింగి నిల్చినపి
శాచము చీఁకటిమేను వ్రీల, లో
నిగనిగలాడులోకములు
నిర్మలతన్ భజియించువేళ నా
సగరకులప్రదీపకుల
సంయమి నిద్దురఁ దేర్చె మెల్లనన్. 36

ప్రాతరగ్నిహోత్రభాసురాశ్రమభూమిఁ
బ్రబలె మునుల స్వస్తివాచనములు
సిద్ధతటిని దాఁటి సిద్ధాశ్రమముఁ జేరఁ
బయన మయ్యె గాధిపట్టి యంత. 37

అంతకు మున్నె రాఘవు ల
హర్పతి కర్షుఖ్యి మొసంగి తమ్ము న
త్యంతముఁ బ్రీతిమైఁ గనెడు
నాశ్రమడింభకపంక్తి క్రొల్వ ని
శ్చింతతఁ గానవచ్చి ముని
సింహునకుఙ బ్రణమిల్లి రాస్థిర
స్వాంతుఁడు వారితో వెడలె
సంయమివర్గము సాగనంపఁగఙ. 38

గంగాపారముఁ జేరి కౌశికుఁ డనెఙ
గాకుత్స్థ! దాదవ్వులఙ
నింగిఙ బ్రాఁకినపాదపాగ్రములతో
నీరేజబంధుప్రభా
సంగం బన్నది లేనికాన యిది, దు
శ్చారిత్రసుందాంగనా
శృంగారోపవనంబు సంయమిజనా
సేవ్యంబు వీక్షించితే. 39

క. మదనాగాయుతసత్త్వయుఁ
గదనప్రియ గలదు మనుజఘాతిని యిచటన్
విదిత యగుఁ దాటకాఖ్యన్
బ్రదరాహతి మున్నె దీని భంజింప నగున్. 40

చ. అంగనఁ గూల్పు మన్న దర
హాసము లజ్జ విశాలలోచనా
పాంగ మలంకరింప ముఖ
పంకజ మించుక వాంచి యాధను
శ్శృంగుఁడు మిన్నకుండుటయు
సంయమివర్యుఁడు రామచంద్రునా
యింగిత మాకలించి హసి
యించి వచించె నయోచితంబుగన్. 41

ఉ. మానిని యన్నమాత్రమున
మానవభామలఁ బోల్చి చూడఁగాఁ
గానఁగవచ్చునే! యసుర
కాంతస్వరూపము రామచంద్ర! యా
దానవి కిచ్చెఁ బూర్వము వి
ధాత గజాయుతసత్త్వ మిష్టుఁడై;
దానఁ గదా! తపోధనులు
తల్లడ మందుట దానిధాటికిన్. 42

ఉ. తాటకమాట విన్నయె[illegible]
దాపససంఘము లేమిలెక్క దూ
రాటవిఁ గ్రూరసత్త్వచయ
మట్టులె రాపడి నిల్చు నాపత
త్కోటియు గూండ్లలో నొదిగి
కూయుట కేనియు జంకు నింతయుం
బూటక మానె యేల తినఁ
బోవుచు స్వాద్యత పృచ్ఛసేయఁగన్. 43

ఉ. ఆచపలాత్మకున్ గలిగె
నాత్మజుఁ డొక్కఁడు పాపమూర్తి మా
రీచుఁ డనంగ, మాను లోన
రించుమహాధ్వరకర్మ లెల్ల నా
నీచుఁడు వమ్ముసేయు, వని
నిత్యము పుష్పఫలార్థ మేఁగఁగాఁ
గాచి మునీశులన్ దునుము;
ఘాతుకచర్యకు హేతు వుండునే? 44

ఉ. ఈశరుఁ డొక్కనాఁడు జన
యిత్రియుఁ దానును సప్తవార్ధు లా
పోశన మెత్తినట్టిముని
పుంగవు మార్కొని మ్రింగఁ బోవ నా

పాశుపతుండు దృక్కలిత
పావకకీలలు గ్రుమ్మరించి భ
గ్నాశులఁ జేసెఁ; బ్రాణితన
హానినిఁ దా వరియించు మూర్ఖతన్! 45

ఉ. రూపులు మాఱి కుంభభవు
రూక్షవిలోకనకీలపెల్లులో
రాపడి నిల్చినన్ నహుష
రాణ్మణినూత్నవిభూతిగర్వని
ర్వాపణదక్షుఁ డౌముని కృ
పం గని రాక్షసభావ మందఁగా
శాప మొసంగి పో మ్మనియె;
సజ్జనకోపము విద్యుదాభ మౌ. 46

ఆ. వె. దానవిచరితంబు దవిలి యాకర్ణించు
దశరథాత్మజులకు దారినడక
యాటపాటలట్లు హర్షదం బై యొప్పెఁ
దాటకావనంబు దగ్గ ఱయ్యె. 47

చ. మనుజులగాలి సోఁక మద
మత్తనిశాచరి యావులించి గ
ర్జన మొనరించెఁ బత్త్రరథ
సంతతు లొక్కటఁ బాఱె ఖింటికిన్

వెనుకకుఁ దారె కౌశికుఁడు
　　విన్నఁదనంబున స్విన్నగాత్రుఁడై
మునుకొని సాగె రాఘవుఁడు
　　మోమున సుస్మిత మంకురింపఁగన్. 48

తత్తర మంది తాపసుఁడు
　　దాశరథిన్ దిలకించి పల్కె: 'వి
ద్వత్తము లాత్మరక్షణమె
　　ధర్మనిదాన మటంచుఁ దెల్పరే
చిత్తము గట్టిచేసికొని
　　స్త్రీ యను జాలిని వీడి వేగ వి
ల్లెత్తుము వచ్చుచున్నది య
　　హీనపరాక్రమఁ జూడు రక్కసిన్' 49

కనుఁగొనె లక్ష్మణాగ్రజుఁడు
　　కాళులు మొల్చినయంజనాద్రి నాఁ
దనపయి వచ్చుదాని సము
　　దగ్రగుహాయితవక్త్రనిస్సర
ద్ఘనజఠరాగ్నికీల యనఁ
　　గన్పడుభీషణజిహ్వదాని ని
స్వనపరుషాట్టహాసఁ బ్రతి
　　శబ్దితపర్వతకూటఁ దాటకన్. 50

ఉ. 'చూచితె లక్ష్మణా! నర ని
షూదని యీవికృతారుణాక్షి దృ
గ్గోచర మైనమాత్రమున
గుండెలు నీ అగు భీరుకాళికిన్
వే చనుఁగాక యీయనద
వీనులు నాసిక ద్రొల్లనేయ ని
స్సీ! చపలాత్మ వృద్ధ సమ
యింపఁగ నామది సంకుచించెడిన్.'

చ. అని యనుజన్ముతోఁ బలుకు
నంతటిలో రఘువీరుఁ డాఁకి యా
దనుజ రజశ్శిలాపటలి
ధర్షితుఁ జేయ నమర్షనేత్రుఁ డై
యినకులభూషణుండు ధను
వెక్కిడి రక్కసికర్ణనాసముల్
దునిమె విశిష్టసమ్మదము
తో గురుముఖ్యుఁడు తేటిచూడఁగన్,

చ. అగణితశస్త్రపాత, రుధి
రార్ద్రి, నిశాచరి, దండతాడితో
రగికరణిన్ బ్రకోపిత, దు
రంతమతిభ్రమదాయి మాయ మై,

[redacted]



గగనతలప్రచారమున
గండశిలల్ గురియింపఁగా, మహా
శుగమునఁ గూల్చె దాని రిపు
సూదనుఁ డస్త్రకళాప్రవీణతన్. 53

ఆ. వె. కదనభూమి ధూళికలితాలకలు వీడి
వదనచంద్రుశోభ వర్ధిలంగ
వీరరేఖఁ బొల్చి ధీరత నిలుచున్న
రాముఁ జేరి గాధిరాజసుతుఁడు. 54

శా. 'అన్నా రాఘవ! నొచ్చితే? చెనటి ని
న్నాయాసితున్ జేసెనే?
ని న్నీరక్కసిబారిఁ ద్రోసి వెనుకన్
నిశ్చింతత న్నిల్చితిన్
జిన్నంబోవఁగ నేల? ముందుగ జయ
శ్రీ పాణి నందిచ్చె నా
కన్నుంబండువు నాంది సు మ్మిది జగ
త్కల్యాణసంప్రాప్తికిన్' 55

క. అని త న్నభినందింపఁగ
మునిపాదసరోజయుగ్మమున కతిభక్తిన్
వినతుఁ డగురామచంద్రుని
ఘనసమ్మద మొదవ మౌని కౌఁగిటఁ జేర్చెన్. 56

చ. తమగురువర్యుతో నడచి
దాశరథుల్ దిలకించి రొక్కయా
శ్రమము: మదేభఖడ్గమృగ
సాంద్రవనాంతరపర్వతాళిమ
ధ్యమము, తపోధనారచిత
దానవశాంతికహోమధూమని
ర్గమము, ప్రఫుల్లపాదపము,
కంజసుగంధిసుధాంబుపూరమున్. 57

ఆ. వె. బలివిభూతి యెల్ల బ్రహ్మార్పణంబుగా
మెట్టి తిగిచినట్టిపొట్టి వడుగు
కేలు సాఁచి యగ్నికీల నర్చించిన
భూమిఁ జూచి మేను పులకరింప. 58

ఉ. మాటల కందరానిమహి
మస్ఫురణంబులు ప్రాగ్భవాలకున్
బాటలు సూప నైజగుణ
భావపరంపర జ్ఞానతంత్రులన్
మీటఁగఁ దాటకాంతకుఁ డ
మేయముదంబున 'నెవ్వ రివ్వనీ
వాటి వసించు సంయమి? ప్ర
భావధురీణుఁడు సత్త్వసంపదన్? 59

ఉ. 'ద వ్విఁక నెంత మౌనివర!
తావకయాజ్ఞికకర్మ మమ్ముగాఁ
గ్రొవ్వి నిశాచరుల్ వివిధ
కుత్సితముల్ పచరించుచోటికిన్?
రవ్వ రవంత లే కిట ని
రంతరమున్ మునియాహ్నికక్రియల్
నివ్వటిలన్ మదాత్మ నతి
నిర్మలభావము విస్తరిల్లెడున్' 60

క. అని పల్కు-రామచంద్రుని
యునికిం దిలకించి యతులితోత్సాహముతో
మునిచంద్రుఁ డిట్లనున్: 'వా
మనునాశ్రమ మంద్రు దీని మౌనులు భక్తిన్. 61

ఉ. 'వామనగాత్రుఁ డై తొలుత
వారిజనేత్రుఁడు బ్రహ్మచర్యతే
జోమహితుండు సల్పె నిట
శుద్ధతపశ్చరణంబు, దాన నీ
ధామము వామనాశ్రమప
దప్రథితం బగు; నిందె సుమ్ము శ్రీ
రామ! మదీయ మధ్వరము
రాక్షసచర్యల కగ్గ మౌటయున్. 62

ఉ. పెన్నిధు లోర్పుతో నడచి
        పేదలఁ జూడఁగ వచ్చినట్లుగా,
నున్నశుభాంగులన్ సముచి
        తోజ్జ్వలవేషులఁ బిన్నవారి నా
పన్నశరణ్యులన్ గనిరి
        బాలురు వృద్ధులు భక్తిరక్తులన్
గన్నుల హర్షబాష్పములు
        గ్రమ్మఁగ నట్టులె నిర్నిమేషు లై 63

ఉ. దీక్షితుఁ డయ్యెఁ గౌశికుఁడు
        ధీరు లహర్నిశ మధ్వరక్రియా
రక్షణ మిచ్చి రెల్లెడల
        రాఘవు లాదట శస్త్రపాణు లై
యేక్షతి లేక యజ్ఞమున
        కేనుదినంబులు సాగె నింతలో
రాక్షసవర్గ మెల్ల సమ
        రంబునకున్ సమకూడి రొక్కచోన్. 64

ఉ. 'ఎల్లిద మైతి మిచ్చటికి
        నెవ్వఁడొ వచ్చి మదంబుఁ గూల్చినాఁ
డెల్లి రణంబు రం డనుడు'
        నెచ్చటినుండియొ వచ్చి రుగ్రు లై

బల్లిదులున్ మహోదరులుఁ
బర్వతకాయులు, దీర్ఘజిహ్వులున్,
దల్లినిఁ గూల్చినట్టిపగఁ
దాటకసూనుఁడు విస్మరించునే? 65

ఉ. "చిన్నికుమారు లాశ్రమముఁ
జేరినవేళ విశేష మేమొ యీ
జన్నము బన్నముల్ బడక
సాగె దినంబులు నైదు నింక నీ
తెన్నున నొక్కరాత్రి గడ
తేఱకపో ద"నుకొన్న వేళకే
యున్నటులుండి వచ్చిపడె
నుగ్రనిశాచరసేన పెల్లుగన్. 66

ఉ. మండెడుయజ్ఞవేదికల
మాంసపుఁగండలు నిండె ఋత్విజుల్
గండఱి నాల్గుదిక్కులఁ గ
కావిక లై పరువెత్తి రంతకో
ద్దండసురారితండముల
ధారుణిపైఁ బడఁబోసెనో నభో
మండల మన్నటుల్ నిలిచె
మాయికరాక్షససేన లెల్లెడన్. 67

చ. మునుకొని కాంచె మింట రఘు
ముఖ్యుఁడు కన్గవ జేవురింపఁగా
దనుజమహోగ్రవాహినికి
దర్ప మెలర్పఁగ నగ్రగామి యై
కనఁబడవచ్చువాని లయ
కాలఘనాఘనమూర్తిఁ దాటకా
తనయునకున్ రణస్థలుల
దక్షిణబాహు సుబాహు నుద్ధతున్. 68

ఉ. ఆతనిపజ్జఁ గాంచెఁ గమ
లాప్తకులోద్భవుఁ డంజనాద్రిదీ
ర్ఘాతతకాయు నూత్నరుధి
రారుణనేత్రు, విశాలవక్షునిన్
మాతృవధాపరాధినర
మాంసనిషేవణకాంక్షి, శాంబరి
ద్యోతితనైకవేషు, ముని
దూషణుఁ దాటకసూను భీషణున్. 69

ఉ. దీక్షితుఁ డైనకౌశికుఁడు
దిక్కులు సూడకమున్నె యగ్నులన్
రక్షణ మేది యించుకయు
నాశము నొందకమున్నె యాగకృ

ద్రక్షణదత్తదృష్టి రఘు

రాముఁడు వైదికకర్మవిద్విష

ద్రాక్షసఘాతియైనప్రద

రంబును గూర్చె ధనుర్గుణంబునన్. 70

ఉ. ఒక్కటె రామనామరుచి

రోజ్జ్వలపుంఖము సాయక మ్మదే

దిక్కునఁ బాఱె నంచు గణు

తింపఁ దరంబె! సుబాహుగాత్రముల్

ముక్కలు ముక్క లై కనుల

ముందట వ్రాలె, సురారిసైనికుల్

దిక్కును మొక్కు లేక వని

దీనతఁ బాఱిరి చెట్టు కొక్కఁ డై. 71

ఉ. అగ్గియొ! గాలియో! దశర

థాత్మజునస్త్రము దైత్యసేనలో

బగ్గున మండి కాల్చె భుజ

బంధురుఁ దాటకసూను నెప్పుడో

వెగ్గల ముట్టి వీచెఁ బృథి

వీస్థలి దాఁటి మహాబ్ధిలోఁ బడన్

గగ్గురుపాటుఁ గొల్పె నిది

కన్నులు విప్పినగాధిపట్టికిన్. 72

ఉ. చీఁకటిఁ జోపి యుల్లసిలు
శీతమయూఖునిచెంతఁ దారకా
నీకము పొల్చినట్టులు ము
నిప్రవరుల్ రఘువీరుప్రోల సు
శ్రీకతఁ దోఁచి రావినయ
శీలుఁడు వారికి భక్తిమై నమో
వాకముఁ బల్కెఁ గౌశికుఁ డ
పారముదంబుధి నోలలాడఁగన్. 73

ఉ. ఆరయఁ దాపసోత్తము ల
హర్నిశ మాపదలందు నెవ్వఁ డా
ధార? ముపాస్య మెద్ది? యని
తాము తపించియు నిశ్చయింపఁగా
నేరరు; రాముఁ గాంచి గమ
నింపఁగఁ గల్గిరి "సర్వదుఃఖని
స్తారకుఁ డీతఁడే" యనుయ
థాస్థితిఁ దత్క్షణ మాత్మసాక్షిగన్. 74

ఆ. వె. సంయమీంద్రుసభను సంపూజ్యమానుఁ డై
పిన్నతమ్ముఁ గూడి యున్నరాముఁ
జూడవచ్చి రంతఁ జుట్టుపట్టులనుండి
యసురభీతివలన నడలుమునులు. 75

ఉ. తాటక సచ్చెఁ, దత్సుతుని
దర్ప మడంగె, వనావళుల్ నిరా
ఘాటము లయ్యె, వారిరుహ
కాంతి సమగ్రతఁ బొల్చె నాసరో
వాటి, ప్రసన్నతన్ గనె న
భంబును దిక్కులు, యాజ్ఞికక్రియా
పాటవ ముల్లసిల్లె ముని
పల్లియలన్ సుఖశాంతిరమ్య మై. 76

# అహల్య

క. జనకుండు పిలువనంపఁగ
మునిజను లానృపతియజ్ఞమున కేఁగెదు నా
ఘనసంభ్రమంబు వింతగఁ
గనుఁగొనురాఘవులఁగాంచి కౌశికుఁడనియెన్. 77

శా. విన్నావా రఘునందనా! మిథిలలో
విశ్వేశుచాపమ్ము వా
కొన్నన్ దీరునె తన్మహామహిమ మీ
కున్ దర్శనీయం బగున్
ఛిన్నారాతిధనుర్వికర్షణకళా
శ్రీ మించు వీరాగ్రణుల్
చిన్నంబోయిరి దానిఁ బట్టి తివియన్
జే చాఁచి భగ్నాశులై. 78

చ. హరుఁడు ధరించె నంట, మిథి
లాధిపునింట నెసంగు నంట, యు
ర్వర భుజశాలు లందఱకుఁ
బట్టి కదల్ప నసాధ్య మంట, యా
కర మరుదైనకార్ముకముఁ
గన్గొనకుండఁగ నౌనె? వింటినే
ర్పరికి, యశోవిహారికి, స
పత్నవిదారికి, నస్త్రధారికిన్. 79

ఉ. బాలుర, విద్యుదంబుధర
భాసురగాత్రుల మిమ్ము నస్త్రవి
ద్యాలలితాత్ములం గని ము
దం బొదవన్ జనకుండు సర్వభూ
పాలురమ్రోల పాద్యమధు
పర్కము లిచ్చి బహూకరింపఁగా
నోలి కనుంగొనంగ మది
నువ్విళులూరెద రీతపోధనుల్. 80

క. అని చవులూరఁగఁ బల్కెడు
మునివరుపల్కులకు నలరి మునివర్గముతో
నినకులతిలకులు వెడలిరి
వినికికి శుకపికరవంబు వేడుక సేయన్. 81

ఆ. వె. పండుటాకు తేలి ప్రవహించునీటిపైఁ
జిగురుటాకుజంట చెలఁగుకరణిఁ
బరమమునులనడుమఁ బయనించురాఘవుల్
చూచువారిమనసుఁ జూఱఁగొనిరి. 82

క. "ఇదిగో! విదేహదేశం
బదిగో! మిథిల" యని కదియ నరిగెడిచోటన్
సదయమతి వారు గాంచిరి
ముదిమ్రాకులనడుమ నొక్కమునియాశ్రమమున్. 83

ఆ. వె. మంచు క్రమ్మినట్లు మందాంధకార మై
శోభ తఱిగి ప్రాణిశూన్య మైన
యాశ్రమంబు గాంచి యర్కాన్వయుఁడు వెక్కఁ
గనికరంబు పొంగి కనులఁ దొలఁక.

చ. కనికని జాలిఁ జెందినటు
కన్నుల నశ్రులు నింపి దవ్వులన్
జనుహరిణాంగనాచయము,
జంకెడు లోఁ జొఱఁబాఱఁ బుల్గులున్
మునికులచంద్ర, ము న్నొకయ
మోఘతపోవిభవుండు పెంపుమై
మనినది యీప్రదేశ మని
మానసమా స్ఫురణంబు దెల్పెడిన్, 85

చ. అన విని కౌశికుం డనియె
నర్కకులాంబుధిసోమ! తాల్మిమై
వినుము, విషాదగాథ యిది,
వేమరు నన్ నలయించు, గౌతముం
డనుముని పూర్వ మియ్యెడ మ
హాతపముం బొనరించె నెన్నొ!హా
యనములు వజ్రహస్తుహృద
యాంతరనాదులు జల్లుజల్లనన్, 86

ఉ. గౌతముపత్ని పద్మముఖి
కాంచనగాత్రి యహల్య యాశ్రమ
శ్రీతిలకంబు స్వీయశుభ
శీల సపర్యల జీవితేశు సం
ప్రీతునిఁ జేసె మానికుల
భీతమృగాక్షులలోన సాధ్వి యన్
ఖ్యాతి గడించె భవ్యమతిఁ
గాంచె సుపుత్త్రుఁ దపోధనాగ్రణిన్. 87

చ. కడుపు ఫలింపఁ దన్ ప్రియుఁడు
గన్నులఁ గప్పికొనంగ, సాటివా
రడుగులకున్ మడుంగు లిడ
నందము చూడ్కులచందమామ గాఁ,
గుడువను గట్టఁగాఁ గలిగి
కోరినకోర్కి ఫలించుచుండ, నే
నడి గనరానికాఁపురము
సాగె నహల్యకు సౌఖ్యపూర్ణ మై. 88

ఆ. వె. మగువ నొంటి వీడి మానీంద్రుఁ డొకనాఁడు
స్నాన మాడ నేటిసరణి నరిగెఁ
బ్రాణనాథురూపు భావమందున నిల్పి
కనులు మోడ్చి యుండెఁ గమలనయన, 89

ఉ.  అన్నులమిన్న! నీకొఱ క
హర్నిశమున్ గృశియించుచుంటి,
గన్నులఁ గాచియుండ నవ
కాశము నేఁడు లభించె నాకు, నీ
యెన్నికఁగన్న రూపమున
నే నిట వచ్చితిఁ జూడు ప్రీతి ను
ద్యన్నయనోత్పలద్యుతికి
హాసశుచిస్మిత మింపుఁ బెంపఁగన్

క.  అని ప్రణయమధుర మై తా
వినియెఱుఁగనిదివ్యవాణి వీనులు సోఁకన్
మునిభామిని నఱువాతన్
గనుఁదమ్ములు విప్పె మేను గడగడలాడన్ 91

చ.  తరుణి సమీపమందుఁ గనె
దండకమండలుధారి, స్వర్గ భూ
తరుమృదువల్కలాంబరు, సు
ధాపరివర్ధితరమ్యదీర్ఘ పీ
వరభుజు, గాంగమృత్కలిత
భస్మవిభూషితవక్షు, నంగజా
కరమధురానులాపు, నవి
కంపితసత్త్వుఁ, ద్రిలోకవల్లభున్. 92

పరికించి తాపసాంగన
సురపతి యని తెలిసి మదిని సుడివడుకోర్కుల్
పరు లెఱుఁగకుండఁ బయ్యెద
సరిదిద్దుచుఁ బలికెఁ గపటసంరంభమునన్. 93

మునిజనరక్షణక్రియకు
మూలమ వై విలసిల్లునిన్ను నే
మనుకొనునయ్య లోక మమ
రాధిప! నీ విటు సేయఁగాఁ దపో
ధనులకుటుంబినుల్ బ్రదికి
ధాగుణి నిల్వఁ గలారె? యెవ్వరే
గనుఁగొని రేని నాబ్రతుకు
కల్ల గదా! సరివారిలో నిటన్. 94

అని జంకించిన నింద్రుఁడు
విని వినమి నటించె మోము వెలవెలఁబోవన్
బనిగానిపనికిఁ బాల్పడ
మన సించుకమాటకైన మల్లడిగొనదే. 95

౩. ఆఱిపోవ నున్నయంగజజ్యోతికి
స్నేహపూర్ణ మైనచిన్నినగవు
ప్రోదిసేయ నింద్రుఁ బూఁబోణి వీక్షించె
భావ మెఱిఁగి యతఁడు భామఁ జేరె. 96

ఉ. మానిని యిట్టు లుండ నఘ
మర్షణమంత్రజలార్ద్రమూర్తి స్నా
నానకు నేఁగియున్న ముని
నాయకుఁ డప్పుడె రా మనోభవా
ధీనుఁడు వాసవుం డిది మ
దిం దలపోసి కలంగి యాశ్రమ
స్థానము వీడుదారి జడ
దారికిఁ దా నెదు రయ్యె దుర్విధిన్. 97

చ. అడు గిడ రాక, తప్పుకొన
నేతియుఁ గాక కలంగుగుండియల్
దడదడలాడ నెట్టెటులొ
ధైర్యము నూని, చలించుప్రాణముల్
పిడికిటఁ బట్టి నిల్చె బల
భేది మునీశ్వరుసమ్ముఖంబునన్
జిడిముడిపడ్డ నేమి యగుఁ
జేసిన పాపము పండి పైకొనన్. 98

చ. పరమమునీంద్రుఁ డెప్పుడో! ది
వస్పతిదుష్కృత మాకలించె దు
ర్భరతరకోపవహ్నికణ
భాస్వరదృష్టులవెంట దుర్విపా

క్షురములు వెల్వడెఁ, విబుధ
సంఘము తల్లడమందె, నాశచీ
శ్వరుఁడును దక్షిణంబ వివ
శస్థితి నిష్ఫలుఁడయ్యె వింతగన్. 99

ఉ. అంతకు మున్నె మౌనిఁ గని
యల్లలనాడెడుప్రాణసంచయం
బింతట నైన మేను విడ
దే మిఁక దిక్కని స్వాపరాధమున్
జింతన చేసి భీతిలి వి
చేతన యై నిలుచున్న కాంత క
త్యంతకఠోరశాప మిడెఁ
దాపసుఁ డెంచునె పక్షపాతముల్. 100

తే. వాయుభక్ష నిరాహార భస్మశయన
నరులకంటె కగోచర నవసి నవసి
నాఁటినుండియు నిం దుండె నేఁటిదాఁక
పోయి చూతమె రాఘవా! పౌలఁతియునికి. 101

క. అని గాధేయుఁడు పలుకఁగఁ
గనుకొనలఁ గృపారసంబు కడలుకొనంగన్
మునుమున్న మౌని నడువఁగ
వెనువెంబడి దాశరథులు వెడలిరి ప్రీతిన్. 102

ఆ. వె. దవ్వు నడచి వారు తాపసాశ్రమభూమి
చేరి నిలిచి రచటిచెట్లనీడఁ
గుతుకసాంద్రుఁ డర్కకులచంద్రుఁ డట సాగి
యడుగుఁ బెట్టె నాశ్రమాంతరమున. 103

చ. చరణరజస్సు సోఁక రఘు
సత్తముముండటఁ దోఁచె వల్కలాం
బరధర, పూర్ణచంద్రముఖి,
పద్మదళాక్షి, తటిల్లతాభ, సం
విరతసమస్తకల్మష, న
వీకృతజీవిత, భక్తిహర్ష ని
ర్భరహృదయాంతరాళ, నుతి
భాసుర, భూసురకాంత వింతగన్. 104

శా. ఎన్నోవత్సరముల్ గతించినవి తం
డ్రీ! రాళ్లై చుట్టాలుగా
నున్నా నీవని మొండిప్రాణములతో
నొక్కర్తఁ బెంజీఁకటిన్
గన్నా రెవ్వరు? నాదుపాపములఁ బో
కార్పంగఁ జిద్రూప! నీ
కన్నన్ బందుగు లెవ్వ రయ్యా? రఘురా
మా! దీనకల్పద్రుమా! 105

శా. ఎల్లన్వేళల "రామ,రామ," యనినే
నిక్కోటన వాపోవ నీ
యుల్లం బిప్పటికేన్ గరంగినది లే
కున్నన్ దయాఁభోధి!, యా
తల్లిం దండ్రిని వీడి మాదృశమహా
దౌర్భాగ్యుల న్గావఁగా
విల్లున్ గోలలు పూని కాఱడవికి
న్విచ్చేయుదే రాఘవా! 106

శా. ఆస ల్మాయఁ దమఃప్రపూర్ణ మగునా
యంతస్సులో మొన్నఁ జి
ద్భాసాంకూర మొకండు తోఁచె నపుడే
తత్త్వార్థపుంభావమున్
భూసంరక్షణబద్ధశస్త్రము సుధాం
భోరాశితల్పంబు శ్రీ
కౌసల్యాసుకృతంపుఁబంట వనిలోఁ
గా లూనె నంచెంచితిన్. 107

శా. దూరానన్ నినుఁ గాంచెఁ గానలయుఁ దో
డ్తోఁ బక్షిసంఘంబులున్
సారంగీతతి పర్వులెత్తె నిటకున్
సంతోష మేపార వే

మారు న్నాదశఁ గాంచి ము న్నివి నను
న్మన్నించెఁ గన్నీటితో
నీరాశన్ శిలలుం జెలంగె వనిలో
నీరేజపత్రేక్షణా! 108

ఉ. బాలకవేషధారి! భవ
బంధవిమోచనకారి! సత్కృపా
పాలితధర్మచారి! మృదు
భాసురహాసజితారి! పార్వతీ
శూలధరాగ్రమూర్ధపరి
శోభితదివ్యపదాబ్జవారి న
న్నేలినచక్రధారి స్పృహా
రీ కరివైరివిదారి శ్రీహరీ! 109

చ. తరణికులాబ్ధిసోమ భవ
తారకనామ మదీయపాతకో
త్కరనిబిడాంధకారఖర
ధామ వనాంతరమానిఘాతకా
సురరణభీమ నీలతను
శోభిభుజాంతరపద్మదామ! త్వ
చ్చరణసరోజయుగ్మ మని
శమ్మును నామదియందు నిల్పుమా. 110

క. అని మునిసతి బాష్పంబులు
కనుఁగొనలం జాలువాఱఁ గరపుటకలితా
నన యై రాఘవుప్రమోలన్
దనువల్లరి వడఁక నిలిచెఁ దత్పరమతి యై. 111

ఉ. తమ్ముని గూడి రాఘవుఁడు
తాపసముఖ్యునిధర్మపత్నిపా
దమ్ములకున్ బ్రణామము ము
దమ్మునఁ జేయఁగ వారిఁ బ్రాణిప
ద్మమ్ముల గ్రుచ్చి యాదశర
థప్రభురాణులు నందరానిమో
దమ్మునఁ దేలె నింతి; యివి
ధమ్ములు పుణ్యఫలప్రకారముల్. 112

క. ఆతిథ్య మమృత మ స్తని
యాతాపసగృహిణి యిచ్చె నర్కకులులకుం;
బ్రీతిం గనె భూతంబులు
పూతాత్మత నింతి భర్తృపూజ్యతఁ గాంచెన్. 113



ఆ. వె. సుదతితపమువోలె సూర్యాతపము పండి
మెల్లమెల్ల జగము చల్లఁబడియెఁ
బ్రొద్దు గ్రుంకుసరికి భూపాత్మజులతోడఁ
గౌశికుండు మిథిలఁ గాంచ నేఁగె. 114

ఉ. కౌశికురాక బ్రాహ్మణము
ఖమ్మున విన్న విదేహనేత తా
నాశుగతిం బురోహితస
హాయుఁడుగా నరుదెంచి బ్రహ్మవి
ద్యాశుచివాక్ప్రసూనముల
నర్చితుఁ జేసి సభక్తి యజ్ఞశి
ష్టాశికి యోగ్య మావిడిది
యమ్మని కిచ్చి వినీతి ని ట్లనున్. 115

ఉ. పావన మయ్యె మద్గృహము
బ్రహ్మఋషీ! శ్రమ కోర్చి శ్రౌతవి
ద్యావిశదాత్మ! నీ విటు ద
యం జనుదెంచుట సర్వదేవసం
భావిత మయ్యె నాక్రతువు,
ప న్నెదియేన్ గలుగంగఁ దెల్పి నా
జీవితమున్ గృతార్థముగఁ
జేయఁ గదే మునివంశభూషణా! 116

క. మునినాథుచెంతఁ గోసల
జననాథునిసుతులఁ గాంచి చయ్యన మిథిలా
వనినాథుఁడు తనచూడ్కియు
మనమును నట నిల్పఁ బల్కె మంజులభణితిన్. 117

చ. కుశికతనూజ! యీకుసుమ
కోమలగాత్రులు విశ్వభృత్కళా
విశదమతుల్ సరూపు లర
విందదళేక్షణు లేరిపుత్త్రి? లే
దిశ వసియింతు? రేల యరు
దెంచిరి కాల్నడ? నిర్వురున్ భవ
ద్వశగతి రాఁగ వీరి మది
వాంఛిత మెద్ది? యెఱుంగఁ దెల్పవే? 118

ఉ. రారు గదా నిజేచ్ఛ దిన
రాజసుధాంశులు మానవాకృతిన్?
గారు గదా మునీశ! రతి
కాంతజయంతులు బాలసోదరుల్?
వీరి సురూపయౌవనవి
వేకధురీణుల నేర్పరింపఁగా
నేరకయున్నవాఁడఁ గరు
ణించి ననున్ విదితార్థుఁ జేయవే. 119

క. అని ప్రార్థించుమహీపతిఁ
గనుఁగొని సుస్మితముఖుండు గాధేయుఁ డనున్
ఇనకులతిలకులు కోసల
జననాథునుపుత్త్రి లమితసత్త్వధురీణుల్. 120

తే. గీ. రామలక్ష్మణనాములు భీమబలులు
యజ్ఞశత్రుదవాగ్నినవాంబుధరులు
దీన గౌతమపత్నికిఁ దీర్ఘపదులు
ధరణి సత్యపరాక్రముల్ ధర్మరతులు. 121

శా. సిద్ధం బైనమదీయయజ్ఞమునకుం
జీకాకుఁ గల్పించునా
బద్ధద్వేషుల శాపవహ్నిఁ గడపం
బ్రాల్మాలి నేఁ గోరఁగా
శ్రద్ధాభక్తులు చూపి తండ్రి యనుపన్
సన్నద్ధు లై వచ్చి యీ
సిద్ధాస్త్రిల్ బలివెట్టి రాసురచల
చ్ఛ్రేష్ఠాళిఁ గంకాళికిన్. 122

చ. కల దని విన్నవారు శితి
కంఠమహాద్భుతకార్ముకంబు నీ
నెలవునఁ, దద్విభూతి మహా
నీయులు దెల్పఁగఁ జూచువేడ్కతోఁ

బిలిచినయట్లు వచ్చి రిట
వీరవరేణ్యులు మత్సహాయు లై,
తెలిసితి గాదె! యాధనువుఁ
దేరఁగఁ బంపు విదేహరాణ్మణీ! 123

క. అనునంత ప్రొద్దు గ్రుంకిన,
జనె నాహ్నిక పరుఁడు నృపతి సంయమి యనుపన్;
మునిపతియును నచటి తపో
ధను లందఱుఁ దెలియ పఱచె దాశరథులకున్. 124

ఆ. వె. కెలఁకులందు సంజకెంపుటోరులు దిద్ది
మల్లెమొగ్గసరు లమర్చె మింట
వెండిగిండి దివియ వెలిఁగించి ప్రాగ్దేవి
మూలమూలఁ దీర్చెఁ బాలవెల్లి. 125

ఆ. వె. ఏమి పండు గింట నెఱిఁగింపుఁ డన్నట్లు
శకునకులరవమ్ము శ్రావ్య మయ్యె
విల్లు విఱుచురాముఁ డెల్లుండి మాసీత
పెండ్లి ర మ్మటంచుఁ బిలిచెఁ బ్రకృతి. 126

ఉ. ఆననకాంతిలోఁ దరళ
హారరుచుల్ వెలరారుమంగళ
స్నానవిశుద్ధగాత్రి, వికసత్సరసీజలజాంజలిప్రభా

మానితపాద బాలరవి
మంజువిశేషక నాయుషారమున్
ధ్యాన మొనర్చి నిశ్చలతఁ
దాపసవర్గ మహార్ముఖంబునన్. 127

చ. అరుణపురస్సరంబుగ న
హర్పతి లోకవిలోకతామసా
వరణముఁ జోపువేళ నర
పాలుఁడు మేల్కని యాహ్నికక్రియా
చరణ మొనర్చి పంచె శివ
చాపనిరీక్షణలోలచిత్తులన్
దరణికులప్రదీపకులఁ
దాపసువెంబడిఁ దోడితేరఁగన్. 128

శా. విశ్వత్రాతలు వీరనేతలు ధను
ర్వేదప్రతిష్ఠాస్పదుల్
శశ్వత్కీర్తివిభూషణుల్ నృపసుతుల్
సౌందర్యరత్నాకరుల్
విశ్వేశప్రతిభానిధానధనువున్
వీక్షింప సోత్సాహులై
విశ్వామిత్రమునితోడఁ గార్ముకధరు
ల్విచ్చేసి రాస్థానికిన్. 129

క. ఎదు రేఁగి యతిథిపూజల
ముదితాత్ములఁ జేసి జనకభూపతి వినయా
స్పదమతి వారల నున్నత
పదమున వసియింపఁ జేసి బద్ధాంజలి యై. 130

ఉ. ఎన్నిదినాలనుండియొ మ
హేశుధనుస్సు మదీయగేహమం
దున్నది తాపసేంద్ర, వుఱి
యొక్కటి విన్నప మాలకింపు! నే
దున్నెడుజన్నపుంబుడమిఁ
దోఁచె హలోద్ధతపేటికాస్థయై
కన్నె యొకర్తు మున్ను కృపఁ
గైకొని పెంచితి దానిఁ బుత్రిగన్. 131

ఆ. వె. హలముచాలునందు నవతరించుటఁజేసి
పూతగాత్రి దాని సీత యనిరి
బాల పెరిగె శుక్లపక్షచంద్రికవోలెఁ
బ్రతిదినంబు కనులపండు వగుచు. 132

ఉ. ఆతతబాహుశాలులు ధ
రాధిపు లెందఱొ వచ్చి మాకు మీ
కూఁతు నొసంగుఁ డంచు ననుఁ
గోరఁగ నీశితికంఠువింటి నే

ఖ్యాతయశుండు పట్టి తమ
కంబున నెక్కెడు వాఁడె సుమ్ము మా
సీతకు నేతయౌ ననుచుఁ
జెప్పితి నిందఱ కొక్కమాటగన్. 133

ఆ. వె. తేఱిచూడ లేక తివియంగ నేరక
ఫాలనేత్రువిల్లుఁ బట్ట లేక
పేరు పొందినట్టిధారుణీశ్వరు లెల్ల
వెడలిరయ్యె! లజ్జ వీటఁబోవ. 134

ఉ. బాలశశాంకమూర్తి రఘు
వంశజుఁ గన్గొన సింహికాత్మజా
భీలము మేరుసార మగు
భీమశరాసనముఙ్ దలంపఁ జిం
తాలన మయ్యె నామది మ
దాంధగజాధిపదుప్రధర్ష మా
సాలము నేలఁ గూల్పఁ గరి
శాబకముం బురికొల్ప జంకెదన్ 135

ఆ. వె. సంయమీంద్ర, నాదుసాహసంబు క్షమింపు
ధనువుమాట యిట్లు తడవినాఁడ
రాజమౌళివిల్లు రాఘవుల్ వీక్షింపఁ
దేరఁ బంచినాఁడఁ దెచ్చి రనిమొ. 136

ఉ. అంతకు మున్నె వేవురు గ [illegible]
జాయతసత్త్వులు పాలసంద్రపుం
జెంతకు మందరాగమును
జేర్చినయ ట్లొకమందసంబు న
త్యంతపరిశ్రమంబున స
భాంగణభూమికిఁ దెచ్చి నిల్పఁగా
నెంతయు వింతతోడ గను
నింపఁగ సాగిరి సభ్యు లెల్లరున్. 137

ఆ. వె. మాని మాన మూని మానవేంద్రుఁడు తెల్పు
హరుధనుస్సుగాథ నాలకించి
మాఱు లేల శివునిమేటి విల్లటఁ జూడు
మంచుఁ బంచె లక్ష్మణాగ్రజన్ము. 138

చ. గురువరునాజ్ఞ నొంది రఘు
కుంజరుఁ డచ్చటిలోహపేటికన్
గరమున నెత్తి తీసి యటఁ
గాంచెఁ బ్రసుప్తభుజంగరాజభీ
కరమును బ్రత్యహంబు సుమ
గంధసమర్చితమున్ నవేందుశే
ఖరకరలాలితంబు నగు
కార్ముకరాజము నద్భుతాకృతిన్. 139

క. కని మేను పులకరింపఁగ
మునినాయకుఁ జూచి ధనువు మోపెట్టుదు నాన్
జనపాలుఁడు మునిపతియును
ఘనసమ్మద మొదవ 'శుభము' కాని మ్మనినన్. 140

చ. పటుతరదోర్బలం బెసఁగ
భద్రగజంబు రసాలశాఖికా
విటపముఁ బట్టుపోల్కి. రఘు
వీరుఁడు చాపముఁ బట్టి యెత్తి యు
ద్భటగతి నెక్కువెట్టి చెవి
దాఁకఁ గర మ్మరి వట్టి లాగినం
బెటపెటఫెళ్లునన్ విఱిగె
భేదిలి తద్ధను వద్భుతధ్వనిన్. 141

చ. పరుషధనుస్స్వనంబు తల
భారము దింపె విదేహధారుణీ
శ్వరునకు, గాధిపుత్త్రుఋణ
భారముఁ దీర్చె దిగంతసాగరాం
బరముల నట్టె ప్రాఁకి యల
భార్గవరామునకున్ మహాశిరో
జ్వరమును గూర్చె; భావములు
భాసిలు స్థానగుణానుసారులై. 142

# కళ్యాణము

ఉ. వేకువ నిద్రఁ దేఁటి కను
        విప్పినతోడనె నీలనీరజ
శ్రీకమనీయమూర్తి యగు
        శ్రీరఘురాముని నవ్వువెన్నెలల్
సోఁకమిఁ గోసలాధిపతి
        స్రుక్కి దినంబులు త్రోయుచుండ న
స్తోకవచస్సుధారసము
        శ్రోత్రపుటంబుల నింపె వింతగన్ 143

ఉ. పెండిలి రమ్ము నీయనుఁగుఁ
        బెద్దకుమారునకున్ ధరాధిపా
ఖండల! పారమేశ్వరము
        కార్ముకమున్ విదళించె రాముఁ డు
ద్దండభుజుండు మాజనక
        ధారుణినాథుఁడు పియ్య మంది నీ
యండ వసింపఁ గోరె నిమి
        యన్వయకీర్తి దిగంతప్రాప్తిగన్ 144

చ. అనుమధురాక్షరంబు జన
        కావనినాథపురోహితుండు పా
వనశుభలీలఁ బల్కుటయుఁ
        బంక్తిరథుండు ప్రఫుల్లనేత్రుఁ డై

కనుఁగొనె; మున్ను జన్నము
ముఖంబున వెల్వడి దివ్యపాయసం
బును దన కిచ్చినట్టిమఖ
పూరుషుఁడే యితఁ డన్నభావనన్ 145

చ. మన మలరంగఁ దా వెడలె
మానవనేత సతీసమేతుఁ డై
తనయులు గొల్చి రాఁగ రథ
దంతితురంగపదాతిసేనతో
వినుతవిభూతితో సచివ
వీరభటావళితో శుభాంగనా
జనములతో వసిష్ఠముఖ
సంయమివర్గముతో విదేహకున్. 146

చ. సుభగము లయ్యె నల్దెసలు,
శుభ్రనభస్థలిఁ జంద్రతారకా
విభవ మెసంగెఁ, గానలు న
వీనలతాద్రుమపల్లవోల్లస
ద్విభవము లయ్యె, నామిథిల
వీధులు మంగళతోరణావళీ
ప్రభలఁ జెలంగె, సృష్టి కను
పండువుగాఁ గనుపట్టె నెల్లెడన్ 147

చ. సురుచిరశాద్వలావరణ
శోభిత యై కుసుమప్రవాళసం
భరిత తరూపగూఢగిరి
భాసుర యై విమలాంబువాహినీ
పరిగతతుంగభూమిధర
పార్శ్వయు నై యలరారె జానకీ
పరిణయవేళ ధారుణి శు
భప్రదవేషవిశేషభూషలన్ 148

ఉ. దాత ప్రతిగ్రహీత శుభ
దాయకుఁ డై విలసిల్లె గాధిసం
భూతుఁడు, నూత్నదంపతుల
పుణ్యచరిత్రకు సాక్షిభూత సం
పూత యరుంధతీరమణి
మున్నుగఁ బాల్గొనెఁ బెండ్లిపెద్ద యై;
సీతవివాహమంగళ మ
శేషముదాస్పద మౌట వింతయే? 149

ఉ. శీతల మైనచూడ్కుల న
శేషజనాధుల ముల్చుప్రోడకున్
భూతగణేశువింటి నల
వోకను ద్రుంచినబాహుశాలికిన్

గూఁతు నొసంగు నంట జన
కుండు, సుధాకరహారి నావరున్
జూతము రం డటంచుఁ బుర
సుందరు లందఱు వచ్చి రాదటన్ 150

తే. గీ. మణిమయ స్తంభకళ్యాణమండపమునఁ
గదళికాచూతపల్లవాకలితవేది
రామచంద్రునిముందట రాజవదనఁ
బ్రేమఁ గూర్చుండఁ బెట్టిరి పేరటాండ్రు. 151

తే. గీ. వరుసఁ దెరపచ్చడము వధూవరులనడుమ
సిగ్గుతెరలకుఁ దో డౌట సీతచూడ్కి
రాముముఖచంద్రు నందఁగా రాక ప్రియుని
పాదనఖచంద్రకాంతిపై వ్రాలి నిలిచె. 152

చ. జనకమహీశుఁ డంకతటి
జానకిఁ జేర్చి తదీయపాణి నా
యినకులమౌళిహస్తమున
నిమ్ముల నుంచి ముదశ్రుపూర్ణుఁడై
'వనధిశయాన! నాతనయ
వారిరుహాలయ ధర్మపత్నిగాఁ
గొను' మని ధారపోసె రఘు
కుంజరు డొంగుట నగ్ని సాక్షిగన్ 153

క. నరపతి యూర్మిళ నిచ్చెన్
నరగుణునకు లక్ష్మణునకు, భరతునకున్ భా
సురతనుమాండవి నొసఁగెన్
సరసన్ శ్రుతకీర్తి నిచ్చె శత్రుఘ్నునకున్ 154

తే. మెల్ల దివినుండి పువ్వులజల్లు గురిసె
మంగళాశీస్సు లిచ్చిరి మౌనివరులు
కుశికనందనుకోర్కులు కొనలుసాఁగె
దశరథేశునికందోయి ధన్య మయ్యె 155

క. భరతుని భరతాగ్రజునిన్
సరసను గూర్చున్నకవల సౌమిత్రుల నా
పురజనులు పెండ్లిపందిట
గుఱుతించిరి యచటిపెండ్లికూఁతులయెఱుకన్. 156

సీ. పసపుఁబయ్యెదలపై నసియాడుహారముల్
పిన్ననవ్వులలోనిచెన్నుఁ బెంపఁ
గళ్యాణతిలకంబుకాంతిపుంజము సాఁగి
బింబాధరద్యుతి పెంపు నింపఁ
గడగంటికాటుక బెడఁగున కిరుక్రేవఁ
దాటంకయుగధగద్ధగలు నిలువ
మీఁగాళ్ళ జీరాడుమేలికుచ్చెళ్లెల్ల
నూర్మికాంగుళిపాణి నొకట ముడిచి 157

ఆ. వె. పెండ్లికూఁతు లెల్లఁ బెండ్లికొమరులతోఁ
గొంగుముళ్ళతీరు కూర్మి తెలుప
యజ్ఞవేదిచుట్టు నతిభక్తిఁ దిరిగిరి
కన్నవారికోర్కి మిన్నుముట్ట.

మ. ముదితస్వాంతుఁడు కోసలాధిపతి స
మ్మోదంబు నిండారఁగా
నుదయానక్ మిథిలాధినాథుఁ డనుపక్
యోధాగ్రణుల్ గొల్వఁగాఁ
గదలెక్ బుత్త్రవధూసమేతముగ; నా
కాకుత్థ్సు దీవించి ది
గ్విదితప్రఖ్యుఁడు గాధిసూనుఁ డరిగెక్
వేవేగ శీతాద్రికిక్. 158

ఆ. వె. ఒకటఁ బెండ్లివారి యోజనమాత్రంబు
సాగనంపి మరలె జనకనృపతి;
త్రోవ దశరథునకు దుర్నిమిత్తంబులు
కానవచ్చె మనసు కలఁతఁ జెంద. 159

# పరశురాముఁడు



క. సుడిగాలి వీచెఁ, బుడమిన్
బడెఁ దరునికరములు, తిరిగెఁ బక్షులు మింటన్,
గడువడిఁ బ్రదక్షిణముగా
నడయాడె నరణ్యమందు నానామృగముల్. 160

మ. పటువాతూలరజఃప్రధూమితము నాన్
బ్రాహ్మంబు క్షాత్రంబు నో
క్కటి రూపొందినయుగ్రతేజ మెదుటన్
గాన్పించె; నిశ్చేష్టులై
భటసందోహము నిల్చెఁ; బంక్తిరథుఁడున్
బ్రస్వేదనిర్మగ్నుఁడై
త్రుటికాలంబు ప్రసుప్తినిశ్శ్వసితగా
త్రుండై యనన్ గన్పడెన్ 161

సీ. నల్దెసల్ వ్యాపించునయనాంతదీప్తులు
నిండారఁ బండిననిప్పు లుమియ
భిదురాభభుజపీఠి భీమకుఠారంబు
కువలయద్యుతిధారఁ గ్రుమ్మరింప

ఫాలపట్టికఁ బొల్చుభస్మత్రిపుండ్రంబు
ముప్పేటనెలరేక యొప్పు గుల్కఁ
జట్రాతిబోరపైఁ జలియించుజందెంబు
శీతాంశుకిరణాలచిక్కు దిద్ద 16

తే. గీ. శాపచాపాయుధార్జితసత్యకీర్తి
యద్రిశిఖరోన్నతుం డైనరౌద్రమూర్తి
క్షత్రకులధూమకేతువు శర్వశిష్యుఁ
డల్లనల్లన భార్గవుఁ డవతరించె.

చ. వినయముతో వసిష్ఠుఁడు న
వీనసమాగతుఁ గాంచి రేణుకా
తనయుఁ డటం చెఱింగి సము
దారమతీ! భృగురామ! యర్ఘ్యముఁ
గొను మని దాఁపుఁ జేర ముని
కుంజరు గీటునఁబుచ్చి యుద్ధతిఁ
గనుకొనచూడ్కి రాఘవునిఁ
గన్గొని పల్కె విఘూర్ణితాక్షుఁ డై 16

చ. ఇరువదియొక్కమాఱు కడు
నేడ్తెర క్షత్రియకోటిపీనకం
ధరరుధిరాంబుధారఁ బితృ
తర్పణముం బొనరించి శైలకం

దరముల శాంతి నున్ననుఁ
దావకశంభువిమానవాధను
ర్ధరణధురీణతాపకృతి
దాశరథీ! కనలించె వింటివే. 164

ఉ. రాముఁ డటన్న పేరు రణ
రంగవిజేతకు నాకె చెల్లె నీ
భూమిని నింతకాలము న
పూర్వభుజాబలవీరకర్మలన్
దీమస మొప్ప నీవు గడి
దేఱుట రామపదప్రయుక్తికిన్
నీమము దప్పెఁ దత్పదము
నీదియొ నాదియొ తేల్పవచ్చితిన్. 165

క. మతిఁ దలఁప నాకు నిర్వారె
క్షితిపై శాత్రవులు పూజ్యశితికంఠధను
ర్హతి నీవును మజ్జనకా
హతిఁ బరశువువాతఁబడిన హైహయ నృపుఁడున్. 166

క. అనుపల్కులు వినినంతనె
తను వెల్లఁ జెమర్ప గుండె తల్లడ మందన్
జనపతి భృగుపతిఁ గదియన్
జని దోసిలి యొగ్గి పలికె సవినయభణితిన్. 167

క. అన్నా! భృగుకులతిలకా!
యెన్నెన్నో పాట్లు వడఁగ నీపసికూనల్
కన్నుల కగపడవచ్చిరి
పెన్నిధు లనఁ; బుత్త్రిభిక్ష పెట్టుము తండ్రీ.

క. ముదిమినిఁ గల్గిరి నిన్నెవు
డెదిరింపఁగ రారు కీడు లెవ్వరి కేనిఁ
మదిఁ దలఁపరు; నీ నియతికిఁ
గొఁద వగుఁ గృపఁ జూడు పెండ్లికొమరులు తండ్రీ

క. నరనాథులశిరములతో
సురపురికిఁ దండ్రికొఱకు సోపానములన్
విరచించి శాంతి నందియు
మరలన్ శస్త్రంబు గొన సమంజస మగునే.

క. హృదయము భేదిల్లంగాఁ
దుదిఁ గాననిదుఃఖవహ్నిఁ దూలెడునృపతిన్
మది లెక్కఁగొనక భార్గవుఁ
డదయత శ్రీరాముతోడ ననియెన్ బెలుచన్.

మ. చెద లంటెన్ మిథిలేశునింటఁ బడి యా
శ్రీకంఠుచాపంబు ది
గ్విదితప్రఖ్యుఁడ వౌదె దానిఁ దునుమన్?
వీరత్వనిష్కర్షణం

బిదిగో విష్ణుమహః ప్రభావలసితం
బీవిల్లు మోపెట్టినం
గద! నాతో సరిపోరఁగాఁ దగినవీఁ
కః గాంచి ని న్మెచ్చెదః. 172

ఆ. వె. పద్మనాభువిల్లుఁ బట్టి యాకర్షింప
శక్తి చాలదేని సాధువృత్తి
శిరము వంచి యెదుట శరణని రఘురాము
యంజలించితేని యభయ మిత్తు. 173

తే. గీ. చిన్నవోయినగురువర్యు తెన్నుఁ గాంచి
భంగపడి కుందుతనతండ్రిభంగిఁ జూచి
రాజదంభోజనేత్రుఁడు రాఘవునకు
నించుకించుక కన్గొన లెఱ్ఱవాఱె. 174

చ. పరశుభుజప్రదీప్తుఁడగు
భార్గవుపల్కులు నాలకించి భా
స్కరకులదీపకుం డనియె
సంయమిచంద్రమ! సైఁచినాఁడ ని
ప్పరుషవచోవిజృంభణము
బ్రహ్మకుల ప్రభవుండవౌట నే
గురుజనసన్నిధిం బలుకఁ
గొంకిన న న్నిటు చుల్కఁజేసెదే. 175

చ. తెలియుదు నిన్ను నార్క కుల
దీపకుఁ డంచు నరేంద్రజిద్యశః
కలితుఁడ వంచుఁ; గాని గత
కాలపుగాథలు ముక్తకంఠతన్
బలికినఁ దెల్ల మౌనె రణ
పాండితి నీవె జయంబు నెల్లెడన్
విలిచినయట్లు పల్కు టిది
వీరులు సైతురె భూసురోత్తమా. 176

ఉ. "శాంకరకార్ముకంబు గత
సత్త్వము తావకధన్వమే! నిరా
తంకము తద్వికర్షణము
దగ్రభుజాబలశాణ" మంచు ని
శ్శంకతఁ బల్కి తిందుఁ గల
సత్త్వము నిప్పుడె చూడఁ గోరితేన్
జంకక నిల్వు మంచు రఘు
సత్తముఁ డల్లన విల్లు గైకొనన్. 177

స. నీరపూరం బెల్ల వారాశిఁ గలియంగ
వట్టిపోయినయేటిపట్టనంగఁ
బదియునాఱుగుకళల్ పర్వేందుఁ గూడంగ
శూన్య మౌహరుజటాజూట మనఁగఁ

బుష్పపల్లవరాశి భూమిపైఁ బ్రాలంగ
నిట్టనిల్చినమద్దిచెట్టనంగ
ననిశంబుఁ గొనసాగుహంకారవిస్ఫూర్తి
యాఁగిపోయినమహాయోగి యనఁగ 178

ఆ. వె. ధనువుతోడఁ గూడి తనశక్తు లన్నియు
రాముఁ జేరఁ బరశురాముఁ డట్టె
నిలిచె సాధువృత్తి నిర్వీర్యుఁ డై తన్నుఁ
బోలఁ జూచువారు జాలిఁ జెంద.

శా. సీతావల్లభుఁ డిందిరేశధనువున్
జే నంది మంత్రాక్షర
జ్యోతిర్మూర్తి శిలీముఖంబు నరి సం
యోజించి యాకర్ణ ము
ద్భూతక్రోధుఁడు బాహుసత్త్వగరిమన్
బూరించి యాభార్గవున్
భీతస్వాంతునిఁ గాంచి నీరధరగం
భీరాతిహృద్యధ్వనిన్. 179

చ. "తొడిగితి సాయకమ్ము హర
తోయజసంభవు లడ్డ మైన నిన్
విడువదు, నిల్వు" మన్న రఘు
వీరుని యాకృతిఁ గాంచి తాపసుం

డడలుచు ఫాలభాగమున
నంజలిఁ జేర్చి భయంబు భక్తియుక్
దడఁబడ బల్కె 'నాయఘము
దాశరథీ క్షమియింపవే దయన్. 180

చ. "వరకరుణానిధాన మగు
వైష్ణవతేజము క్షత్త్రభూమికా
ధరణ మొనర్చి యెట్లు నిజ
ధర్మముఁ దప్పక దుష్టశిక్షణా
నిరతినిఁ జూపునో" యనుచు
నే నిటు పల్కితిఁ గాని క్షత్త్రధి
క్కరణము గాదు నన్ గరుణఁ
గావఁగదే రవివంశభూషణా! 181

చ. గురు లోక క్రేవ నీయనుఁగుఁ
గోమలి యొక్కెడ నిల్చి చూడ నే
వెరవున బాలయోధుఁడవు
వీరరసస్ఫురణంబుఁ జూపెదో
యరయఁగఁ గోరి నే బరుస
మాడితి నింతియ కాని క్షత్త్రధి
క్కరణ మదెట్లు గల్గు నిఁక
మ్మౌతలి నీవు పదమ్ము వెట్టినన్? 182

మ. స్మితదీప్తుల్ వెలయంగ నవ్య[illegible]
శ్రీ మించు నెమ్మోమునన్
వితతాహంకృతి కోపరేఖ పొడమన్
వీక్షింపఁగా నాత్మలోఁ
గుతుకం బౌట నకారణంబ యిటు నిన్
గ్రూరంపువాగ్బాణసం
హతి నొప్పించితిఁ గావు మయ్య, శుభదా
తా! నిత్యసత్యవ్రతా! 183

గీ. తెన్ను గానక ప్రాణము లన్నుకొన్న
జామదగ్న్యునిఁ దిలకించి జాలిఁ జెంది
పొల్లుపోవనితనయంప సెల్లుఁ దలఁచి
రాముఁ డిట్లనె నాభృగురాముతోడ. 184

చ. “మునివర, యిమ్మహాశర మ
మోఘము నా కుపసంహరింపఁగాఁ
జనదు మహీసురాన్వయుఁడు
శాత్రవుఁ డేని వధింపఁ జాల నీ
మనుగడ యక్షతంబు గ ఝ
మాస్థలి నుండు నవశ్య మిప్పు డిం
ధన మగుఁ జుమ్ము తావకప
దద్వయి మామకశ్రువహ్నికిన్. 185

క. బలిమూలె రామభద్రుని
ధృతి సెడి జమదగ్నిసుతుఁడు దీనాననుఁ డై
గతిలేనిజీవకోటికి
గతి వై యిటు సేయుమయ్య గతిభంగంబున్. 186

చ. పదయుగ మేల త్రుంచెదవు?
పద్మదళాక్ష! త్వదస్త్రవహ్ని కా
స్పద మగునట్లు మామకత
పఃఫలచంద్రసురేంద్రలోకముల్
వదలితి నంచు నాజ్ఞఁ గొని
భార్గవుఁ డేఁగె నిజేచ్ఛ; రాఘవుల్
గదలిరి బంధుయోధనిజ
కామినిబృందముతో నయోధ్యకున్. 187

శా. శ్రీరామా! భృగురామగర్వహరణా!
సీతామనోవల్లభా!
ఘోరాకారసుబాహుకుంభివిదళ
త్ర్కూరాసివిద్యుత్ప్రభా
రారాజత్కమనీయనీలజలదా!
రాజాధిరాజార్చితా!
వీరాగ్రేసర! మానిపత్నివరదా!
విశ్వంభరా! శ్రీధరా! 188

మాలిని. మృదులమధురభాషా! మీనకూర్మాదివేషా!
సదమలమణిభూషా! సాధురక్షామనీషా!
విదితసకలవిద్యా! వేదవేదాంతవేద్యా!
పదనతవిబుధేంద్రా! పాహి మాం రామచంద్రా! 189



ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధలలితకవితావైభవ,
కోటాన్వయోద్భవ, భారద్వాజసగోత్ర, ఆదిలక్ష్మీ
సుబ్బరాయపుత్త్రి, ఉభయభాషాసాహిత్యవిద్యా
ప్రవీణ, భారతాభ్యుదయనామకనవ్యకావ్య
రచనాధురీణ, శ్రీమద్వెంకటగిరిరాజ విక్రమసింహపురీవేం
కటగిరిరాజ కళాశాలాంధ్రగీర్వాణ
భాషోపన్యాసక, సౌజన్యోపాసక,
సుధీవిధేయ, సుబ్రహ్మణ్య
నామధేయప్రణీతంబైన
శ్రీ రా మ తా ర క
మహాకావ్యంబు
నందు బాల
కాండము

—: ఓమ్ తత్ సత్ :—

# భారతాభ్యుదయము

# శబరబాల

[పద్య కావ్యము]

కవి: కోట సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆంధ్రభాషోపన్యాసకులు

వేంకటగిరి రాజ కళాశాల — నెల్లూరు.

వెల : రూపాయిన్నర

1958 డిసంబరు మాసభారతి యిట్లు వ్రాయుచున్నది:—

ఇది స్వకపోల కల్పిత కథతో రచించిన పద్యకావ్యము.

ఈ కవి కావ్యకథా నిర్మాణంలో కూడా కొత్త పద్ధతే అవలంబించారు. సామాన్యంగా ఆధునాతన కావ్యాలేనైనా కొంత శ్రద్ధపట్టి చదువుకోవాలి. ఈ కావ్యం మొదటినుంచి చివరివరకు ఒక చిన్న కథలాగే సుఖంగా సాగిపోతుంది.

భారతాభ్యుదయములో వాడినవన్నీ సాంప్రదాయిక ఛందస్సులే. ఇవన్నీ సరళంగా హృద్యంగా సాగిపోతున్నాయి. పదాల కూర్పులో పాండిత్యం ప్రస్ఫుటంగా ప్రకటించగల విద్వత్తు ఉన్నా అది పదాడంబరంగా పరిణమించకుండా జాగ్రత్తపడగల కవులు వీరు.

— శాస్త్రి